# నేనూ మాకాంతం

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

బి. ఏ., యల్. టి.




పబ్లిషర్సు: అడ్డేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# ప్రకాశకుల కృతజ్ఞత

విఖ్యాతకథానికారచయిత శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు: తాము రచించియున్న 1 నేనూ మా కాంతం, 2. కాంతం కైఫీయత్. 3. మునిమాణిక్యం కథలు. 4. మునిమాణిక్యం నాటికలు, 5. కాంతం కాపరం, 6. ఉపాధ్యాయుడు. 7. మేకీ కహానీ, 8. తిరుమాళిగ అనే గ్రంథము లెనిమిదిన్నీ, మాప్రకటనశాఖ యెడల తమకు గల ఆదరాభిమానములతో, అయిదు సంవత్సరములవరకును మేము మాత్రమే ప్రకటించుకొనే హక్కు మాకు దయచేసియున్నారు. ఇందుకు, వారికి మేమెంతయు కృతజ్ఞులము. అవన్నియు వెన్వెంటనే మేము ప్రకటింపబూనుకొన్నాము.

దొరబాబు అనే పుస్తకములో ఉన్న మూడుకథలు యీపై 1, 5 పుస్తకాలలో చేరిపోయినవి.

మరిన్నీ, ఇదివరకే వారు సర్వాధికారములతోడను మాకు దయచేసియుండిన "కాంతం కథలు" అనే గ్రంథమును, ఇప్పుడిప్పుడే మేము రెండవ కూర్పు ప్రకటించి ఆంధ్రమహాజనులకు నివాళించుకొనియున్నాము.

రాజమండ్రి
1 జనవరి 1944

ప్రొప్రయిటరు-
సరస్వతీ పవర్ ప్రెస్

Saraswathi Power Press, Rajahmundry
Printed and published by
A. Lakshmanaswamy Naidu
For Addepally & Co.,
Educational Publishers
Order No. 4750/1948.

1st Edition 1944
2nd Edition 1948

# అంకితము

---

నా పంచ ప్రాణాలలో ప్రాణమై, అనుంగు బావమరిదియైన మా నారాయణరావుకా ?

మా నారాయణరావును మాకూ, లోకానికీ తిరిగి ఇచ్చిన శ్రీ డాక్టరు ఉళక్కి-గారికా ?

మా బావమరదిలో, వాడికి ప్రాణంపోసిన ఉళక్కి-గారిని చూచుకొంటూ, మా నారాయణరావుకు ఇది అంకిత మిస్తున్నాను.

మునిమాణిక్యం నరసింహారావు.

# కృతజ్ఞత

ఈ కథలు చిన్నప్పుడు మా శివశంకరశాస్త్రిగారు నాలో పెంపొందించిన ఉపజ్ఞకు ఫలితాలు. వారు చూపిన దారిలోనే ఇవి ఇంతవరకూ రాణించి ఆంధ్రుల అభిమానాన్ని పొందినవి.

నాకు దేశంలో కొద్దో గొప్పో పేరుప్రతిష్ఠలు తీసుకొచ్చిందీ, నన్ను కథకునిగా తయారుచేసిందీ, మా శివశంకరశాస్త్రిగారే.

అందుకని నిజంగా నేను పుస్తకం వ్రాసి కృతజ్ఞత చూపాలిసింది మా సాహితీసమితి సభాపతులకే. అప్పుడప్పుడు మిత్రులు బాగున్న విషయాలను మెచ్చుకొంటూ నాలో ఉత్సాహం పురికొల్పినా అవి క్షణికాలు.

నిజంగా చేయూతా, స్థానం, యిచ్చిందీ మా శాస్త్రిగారే.

మా సాహితీసమితి సభాపతులూ, పండితులూ, దేశభక్తులూ, ఉత్తమకవులూ, నాకు గురుమూర్తులూ అయిన శ్రీ శ్రీ శివశంకరశాస్త్రిగారికి నా కృతజ్ఞతను విన్నవించుకొంటున్నాను.

# నవ్వులాటకు

సమీరుడు నాకు బావమరదివరుస. అతడు చామనచాయ గల పొట్టి మనిషి. అయితే స్ఫురద్రూపి. మాకు చిరపరిచితుడు. అందుచే మా కాంతంతో చనువుగా మాట్లాడుతాడు. అతడువచ్చి వీధిగదిలో కూర్చున్నాడని నాకు లోపలికి కబురువచ్చింది.

నేనూ స్నానంచేసి ధౌతవస్త్రము ధరించి కేశ సంస్కారము చేసుకొని వచ్చినాను. ఇద్దరం చెరియొకకుర్చీలో కూర్చున్నాము. సమీరుడికి ఒక సిగరెట్టు యిచ్చి నేనూ ఒకటి వెలిగించినాను. అతను అన్నాడు,

"అయితే నామీద నీకు దయ తప్పినట్లుంది?"

"ఎందుకు అల్లా అంటున్నావు? అల్లా జరుగుతుందా? మన స్నేహం. ఆచంద్రతారార్కం అల్లాఉండాలిసిందే!"

"ప్రతి సంవత్సరాదిని మనము అంతా కలసి కొంతకాలము హాయిగ గడుపుదామని అనుకొన్నాము. మొన్న మొన్నటి వరకు అల్లాగే జరిగింది. కాని మొన్న పోయిన సంవత్సరాదికి నీవు నన్ను ఆహ్వానించకపోవటం నాకు చాలా మనస్తాపం కలిగించినది. నన్నెందుకు పిలువలేదు?"

"కొంచెము నిదానించు. చెపుతాను. తెలుసుగా మా చెల్లెలు కాంతం విషయమై!"

"మా చెల్లెలు కాంతం విషయమై పూర్తిగా తెలుసు. ఏవిషయంలోను ఏమి అంటానికీ ఆస్పదం లేదు. ఆమె దొడ్డ

ఇల్లాలు. నాయందు ఆమెకు మిక్కిలి దయ. ఆమె నాకు ఉపకారము చేసినప్పుడు అది అవసరమైనదనికాని ఆమెకు నాయందు దురభిప్రాయము ఉండనికాని అంటే నేనది విశ్వసించను.”

“సహోదరీ! ఆమెవిషయమై నీవు ఇట్టి అభిప్రాయాన్ని వెలిబుచ్చటం నాకు నిజంగా మనోరంజకంగా ఉంది. నీకు ఆమెయందుండే అభిమానంకూడా మహా గొప్పది. అయితే నిజం చెప్పక తప్పదుకదా? నిన్ను పిలుచుటకు ఆమెకు ఇష్టం లేక పోవుటచేతనే ఇంతకాలానికి నిన్నుగాను పిలువలేదు.”

“నీమాటలు చాలా విచిత్రంగా ఉన్నవి. ఆమె ఇదివరలో నాయందు చూపిన ఆదరము, ప్రేమ అద్వితీయము. ఇట్లు నన్ను పిలవనివ్వకుండటానికి కారణం యేమి? ఇట్టి భావవిన్నానానికి కారణం యేమో నాకు చెప్పాలి.”

“చెప్తాను. మా రాముడు మీకు తెలుసునుకదూ?”

“రాముడా - ఎవరువాడు?”

“మా రాముడిని ఎరుగవా? మా నౌకరు రాముడు.”

“వాడా!—అవును. వాడిని ఎరుగకేమి? ఎరుగుదును. వాడు చాలా మంచివాడు సుమీ!”

“అల్లాగే వాడిని సేవాపరాయణత్వములో హనుమంతుడితో పోల్చవలె. ప్రతి పని కూడా బహుచక్కగా చేస్తాడు. నాబూట్సుజోడుకు రంగువేశాడా అంటే అవి నల్లగా జీడిగింజలవలె నిగనిగలాడుతూ ఉంటవి. వాడు బట్టలు ఉతికినాడా అంటే అవి మల్లెపువ్వులవలె తెల్లగా నుంటవి. నేను తాగే

మందు ఎక్కడినుంచి తేవలెనో, ఎంత మోతాదు ఇయ్యావలెనో మెలకువలన్ని తెలుసు."

"అల్లాగా? అయితే అది చాలాగొప్పవిషయం."

"అంతేకాదు. వాడు ఎటువంటివాడనుకొన్నావు? బంగారము బజారులో కనుపించినా అసహ్యమైన వస్తువులాగ చూస్తాడు. పిల్లలను వాడిచేతికిచ్చి షికారుపంపితే జాగ్రత్తగా కాపాడుతాడు. పైకం యిచ్చి సంతకు పంపినా, బజారుకు పంపినా బహునేర్పుగా బేరంచేసి సరకులు తేవటమే కాక ఒకపైసా అయినా తన స్వంతానికి వాడుకోడు."

"అల్లాగా? నౌకరులలో అంత మంచివాడు ఉండటం అరుదు సుమీ!"

"నీకూ ఆమాటే తోచిందీ? అయితే వాడికిఒకదుర్గుణం ఉంది. అదేమిటో తెలుసునా, సౌందర్యపిపాస. ఇదొక్కటే వాడికున్న కళంకం."

"దానికేమిలే! అదొక పెద్దనీచగుణంగా ఎంచనక్కరలేదు. వయసుతనంలో అది క్షమార్హణీయము. వయసుకు వలపు, చింతకు పులుపు సహజము. సౌందర్యపిపాసా పీడితుడు వాడు. ప్రేమైకజీవి. అదీకాక నిష్కళంకమైన శీలముగల దేవుడెవడు? చంద్రుడికి కళంకం లేదా? భగవానుడు అనే అఖండ తేజోమూర్తి అయిన శూరుని గర్భంలో మచ్చలున్నవి. దాని విషయమై నీవు విచారించవలసిన పనిలేదు. కాని నేను అడిగిన విషయమేమిటి? నీవు చెప్పే సంగతియేమిటి!"

"సఖీరాయా! నీవు నిజంగా సహృదయుడవు. కాబట్టి విన తగినమాట అన్నావు. ఆ ఒక్క కళంకం ఉందని అతనిని పని లోనుంచి తీసివేయటం న్యాయమా?

"ఛీ—ధర్మము కాదు."

"అట్టివాడు ఏదో తప్పుచేస్తే నాభార్య, వానిని పనిలో నుంచి తొలగించమంటే, వాడిపక్షంవహించి ఏదో విధంగా వాడిని రక్షించటం నాకు ధర్మము అంటావా"

"ధర్మాలలోకల్లా అది ఉత్తమ ధర్మము. అట్టి నౌకరు ఉంటే, నేను వాడి పక్షం వహించి అబద్ధాలైనా ఆడి వాడిని కాపాడుతాను. కానీ ఏమి టీ గొడవ! నాప్రశ్నకు జవాబు చెప్పకుండా ఏవో అల్లిబొల్లి కబుర్లు చెప్పి నన్ను మోసపుచ్చా లని చూస్తూ వున్నావు!"

"కాదు, కాదు, విను. నిన్ను చూస్తే నాకు నీయందు గౌర వమూ, అభిమానమూ ఎక్కువ అవుతున్నది. నిజంగా నీహృద యము కరుణార్ద్రము. వాడి సేవాప్రియత్వము, మొద లైన సుగుణాలు నీవు స్వయంగా చూశావు కాబట్టి నీకు వాడిమీద అంత అభిమాన మనుకొంటా."

"ఎప్పుడు చూశాను?"

"రాముడిని నీవు తిరుణాలకు మంగళగిరి తీసుకొని పోయినావు."

"అవునవును, జ్ఞాపకం వచ్చింది. అపుడు నాకు వాడు చాలా సేవ చేసినాడు. వాడేదో పిచ్చిపని చేస్తే వాడిని నేను వెనుక వేసుకొని పోట్లాడినాను."

"పిచ్చిపని యేముందీ ? వడ్రింగి సోమయ్యభార్యని చూచి సౌందర్యపిపాసాబాధితుడై ఏదో అన్నాడట."

"అవును జ్ఞాపకమే. కాని ఏమిటీ గొడవ ?"

"తరువాత మాకాంతంతో ఆవిషయము అంతా ఎవరో చెప్పి, వాడు చేసే వన్ని ఇట్టిపనులే, ఫలాని వారి నౌకరు ఇటువంటి పనులు చేస్తున్నాడంటే మీకే అప్రదిష్ట. వాడిని మీయింట్లో నుంచి వెళ్ళగొట్టండి అన్నారట. వాడిని తీసివేయమని కాంతం పట్టుబట్టి నన్ను వేధించటం మొదలు పెట్టింది. అప్పుడేమి చెయ్యాలె."

"మీరు ఇంట్లోనుంచి వెళ్ళగొట్టడం అవివేకం. అట్టి మంచి నౌకరు దొరకటం దుర్లభం, ఏదో ఒక దుర్గుణం ఉన్నా సహించి ఊరుకోవాలె."

"మనం మొగాళ్ళం సహిస్తాము. ఆడవాళ్ళు ఇటువంటి విషయాలలో బొత్తుగా సహానం చూపరు."

"అయితే ఒకటి చేయకపోయినావా ? మాచెల్లెలు కాంతం ఛాలా మంచిమనిషి. ఏమిచెప్పినా నమ్ముతుంది. ఏదో మాట చెప్పి ఆవిషయం సద్దక పోయినావా ?"

"అబద్ధం ఆడవచ్చు నంటావా?"

"సందేహం ఏమిటి. అటువంటి విషయాల్లో కాకపోతే ఇంకెప్పుడు అబద్ధం ఆడటం."

"భేష్, మంచిమాట అన్నావోయి. ఈమాటే కల కాలం ఉండాలె. వెధవ నౌకరును రక్షించటానికి వాడిని వెనక

వేసుకొని అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యతో అబద్ధాలు చెప్పుతారా ? అంట్లా వనుకొన్నాను. అయితే అప్పుడేమి చేశానను కొన్నావు. అబద్ధం ఆడాను."

"ఏంచేసని చెశావు. కాని నన్ను పండుగకు పిలువవద్దని కాంతం అంట్లానికి ఆమెకు నాపై కోపం ఎందుకువచ్చిందో ఇంతవరకూ చెప్పకుండా నన్ను మరిపించాలని చూస్తున్నావు."

"ఏదోయి, ఆపాయింటికే వస్తున్నా. అప్పుడేమి అబద్ధం ఆడినానో నన్నావా. సోమయ్యభార్యను దుర్భాషలాడింది రాముడు కాదనిన్నీ. వాడితో వెళ్ళిన నీవే ఆపని చేశావని చెప్పి ఆమె నమ్మకపోతే ఎన్నో అబద్ధాలాడి మాయపుచ్చి నమ్మించాను...... .................. అట్లా చూస్తా వెందుకు ? ఇప్పుడే కదా అన్నావు, అట్టి సాకరును అబద్ధంఆడి అయినా ఆదరించాలని. అసలుకథ విను. అప్పుడు కాంతానికి రాముడిపైనున్న కోపం అంతా గిరుక్కున వెనక్కు తిరిగి నీమీద పడ్డది, అందుకని నిన్ను పండగకు పిలువవద్దు అన్నది.

తెల్లబారిన ముఖంతో "ఎంతపని చేశావోయి. కాంతంతో ఇపుడే నిజం అంతా చెపటానికి నేవెళ్ళుతున్నా. కథ అడ్డంగా తిరుగుతుంది చూసుకో." అని సమీరుడు లోపలికి పోయినాడు. నేను ఆరిపోయిన సిగరెట్టును పారవేసి క్రొత్త సిగరెట్టును వెలిగించుకొని కుర్చీలో పడుకొన్నాను. తీరా వీడు నిజము అంతా చెప్పేస్తే ఆకోపం అంతా నామీద పడుతుందే మోరాబాబు. ఏమిటిగతీ. అని అనుకుంటూ దడదడ కొట్టు

కుంటూవున్న గుండెకు శాంతి కలుగజేయాలని ప్రయత్నం చేస్తూఉన్నాను. ఇంతలో 'ఏమండోయ్' అని కాంతం పిలిచింది.

'ఆఁ'

'ఇల్లారండి.'

'ఎందుకు? పనిమీదఉన్నా.'

'ఏంపని? రావాలి' అన్నది. వెళ్ళక తప్పించికాదు. ఏమైనా కానీమని మెల్లగా అడుగులో అడుగేసుకుంటూ లోపలికి వెళ్ళాను.

## ఇంట్లో విరహం

నాటకానికి వెళ్ళి వచ్చాను. నాటకంలో నాయికానాయకులు ఒకరినొకరు ప్రేమించుకొంటారు. ఒకరినొకరు వదలిఉండలేరు.

ఆ తరువాత ఎడబాటు కలుగుతుంది. నాయిక విరహతాపం అనుభవిస్తుంది. ముత్యాల హారాలు తెంపి పోస్తుంది. తుమ్మెదలనూ, కోకిలలనూ తిడుతుంది. చంద్రదూషణ చేస్తుంది. వెన్నెల వేడి భరించలేక బాధపడుతుంది. తాపజ్వరంలో సొమ్మసిల్లి పోతుంది. మన్మధుడ్ని దూరుతుంది. దాసీలు పన్నీరుచల్లి మూర్ఛనుండి ఆమెను లేవనెత్తుతారు.

అటుతరువాత నాయకుడు రావటం అతన్ని అమాంతం తన కౌగిట్లో నలిపి వేయటం, ముద్దులు కురిపించటం జరుగుతుంది.

ఇవన్నీ చూశాను. ఆరాత్రంతా అదే ఆలోచన. జీవితం యొక్క మాధుర్యం అంతా అట్లా ప్రియురాలు ప్రవర్తించటంలో ఉందనుకొన్నాను. అటువంటి అనుభవాలు లేకపోతే జీవితం నిష్ఫలం అనుకొన్నాను. నాజీవితంలో అటువంటి అనుభవం కొంత కలపాలని నిశ్చయించుకొన్నాను.

ఇటువంటి రసానుభవానికి నేను నాయకుణ్ణి, కాంతం నాయిక అయినాము. అయితే కాంతానికి ఇటువంటి నాయికా లక్షణాలు నేర్పటం ఎల్లా! అదో పెద్దచిక్కు. నేను లేనప్పుడు విరహం అనుభవించు. చంద్రుణ్ణి తిట్టు. వెన్నెల వేడి అను. కోకిలనూ తుమ్మెదనూ తిట్టు. మెళ్ళో హారాలు, హారాలు లేకపోతే ఏముంటే అదే, తెంపిపోయి అని చెప్పితే కాంతం వింటుందా ? వినటంమాట అట్లావుంచి నాకు ధైర్యంఏదీ?

కాబట్టి ఒకనాటకం చూపిస్తే, ప్రియుడు లేనప్పుడు విరహం అనుభవించాలని తెలుస్తుంది అని ఊహించి, మర్నాడు "కాంతం, ఈరోజు పెందలాడే వంటచెయ్యి. పిల్లలను మా అమ్మ కప్పజెప్పి మనం నాటకానికి వెడదాము" అన్నాను.

"నాటకానికి నేనెందుకులెండి. నాకు ఇంట్లోనాటకంచాలు. మీరు వెళ్ళండి సరదాగాఉంటే" అన్నది కాంతం పెద్ద పిల్లకు తల దువ్వుతూ.

"నేనుకూడా నాటకానికి వస్తానానాన్న" అన్నది పెద్దపిల్ల.

ఈమాటలు వింటూ ఉన్న చిన్నది తేలుకుట్టినట్లు కెవ్వున కేకేసి ఏడ్వటం మొదలుపెట్టింది. పెద్దవాడు తనసంబంధం లేకుండా ఏమిటో జరిగిపోతున్నదని అనుకొని కామాలు చిందులు తొక్కటం ప్రారంభించాడు. "చూశారా? నాటకం, మనకు వేరేనాటకం ఎందుకు?" అన్నది కాంతం, గులాబిరేకులవంటి చెక్కిళ్లపైన గుంటలు పండేటట్లు నవ్వుతూ.

"నీకెందుకు నీవు వంటచెయ్యి" అన్నాను కాంతంతో. 'మనమంతా వెళ్ళుదాములే అమ్మా' అని పిల్లలతో అన్నాను.

రాత్రికి అందరం పెందలాడే భోజనం చేశాము. చిన్న పిల్లలందరూ నాటకంమాట మరచిపోయి నిద్రపోయినారు. పెద్దది మేకులాగ కూర్చున్నది నాటకానికి వెడదామని. కాంతాన్ని బలవంతంమీద కదలించుకొని తీసి కెళ్లేసరికి మంగళగిరిరథాన్ని కదిలించినంతటి ప్రయత్నమైంది.

౨

ఎట్లాగయితేనేం, కాంతానికి నాటకం చూపించి తీసుకొస్తున్నాను. ఇక ప్రేమతత్వం మెల్లగా బోధిద్దామని "సత్యభామకు కృష్ణునిమీద ఎంత ప్రేమో చూశావా" అన్నాను.

"ప్రేమ ఉండదా, అబ్బరమా!" అన్నది కాంతం.

"భర్త రాక ఆలస్య మయితే ఎంత పరితపించిందో చూశావా?" అన్నాను.

"నాటకం కాదూ. నాటకాల్లో అంతే" నన్నది కాంతం.

"ఆకాస్త, ఎడబాటుకే ఓర్వలేక చంద్రుణ్ణి తిట్టి, కోవిలను దుమ్మెత్తిపోసి, "కళ్ళు కాయలుకాసినా" యని కీర్తన పాడింది చూశావా" అన్నాను.

"కీర్తన బాగానే ఉంది" అన్నది కాంతం.

"కీర్తన బాగుండటం కాదు. భర్తయందు ప్రేమ ఎట్లు చూపిందో చూశావా" అన్నాను.

"అవును చూశాను. కాని ఏమిటా వెధవచేష్టలు. హారాలు తెంపిపోసుకొని శుభ్రమైన పూలన్నీ నలగగొట్టుకొని వెధవ గందరగోళం అంతా చెయ్యకపోతే ప్రేమలేనట్లా ఏమిటి" అన్నది.

"అదికాదు. ప్రేమ ఉన్నవాళ్లు ఎడబాటుకు ఏమాత్రం ఓర్వలేరు. వాళ్లకు వెన్నెల చల్లగా ఉండదు. వేడిగా ఉంటుంది. కోవిలపాట అసహ్యంగా ఉంటుంది" అన్నా.

"చూడండి, ఇదంతా పుస్తకాల్లో గోలేగాని నిజానికి కోయిల కూత, పెద్దపాటనూ, అందులో హాయినా?"

"అల్లా కాదు. అల్లా ఉండాలె. భర్తృవియోగం కలిగినప్పుడు మాసిన చీర కట్టుకోవాలె. స్త్రీకి భర్త లేనప్పుడు తన శరీరంమీద తనకే అసహ్యం కలుగుతుంది. అల్లా ప్రవర్తిస్తే నే ప్రేమ చూపటం" అన్నాను. కాంతం బడికుర్రవాడిలాగ, నేను చెబుతుంటే విని ఊరుకొంది.

## 3

మర్నాడు కాంతానికి విరహబాధ కలుగజేసి రాత్రి చెప్పిన విషయాలు, కాంతం ప్రవర్తనలో ఏట్టి మార్పును, నూతన త్వాన్ని, తీసుకొస్తవో చూద్దామని అనుకొన్నాను. అందుకని "కాంతం, నేను ఊరికెళుతున్నాను. సాయంత్రం పదిగంటల దాకా రాను" అన్నాను.

"వెళ్లకపోతే నేమి? సెలవొస్తేసరి. ఎక్కడికో ఒక అక్కడికి దయచేస్తారు. కాళ్లు నిలవవు ఇంట్లో" అన్నది. కాంతం.

"నేను వెళ్లటం నీ కిష్టంలేదా" అన్నాను.

"ఏమాత్రం ఇష్టములేదు" అన్నది కాంతం.

ప్రియుని ఎడబాటుకు సహింపలేదన్నమాట, అని నాకు నేను చెప్పుకొని సంతోషించి, కాంతానికి వియోగం కలుగజేసి పూర్తిగా సత్యభామలాంటిదాన్నిగా తయారుచేద్దామని సంకల్పించుకొని వెళ్ళిపోయినాను.

సెలవురోజున హాయిగా ఇంట్లోబడి నిద్ర పోకుండా ఇదోటి రావటం మూలాన, స్నేహితుల యిండ్లలోనూ కాఫీహోటలు లోను క్లబ్బులోను కాలంగడపటం కష్టమైనా ఉత్కృష్టమైన కార్యాన్ని సాధించుకొరకు తాత్కాలికమైన చిన్నకష్టాలను లెక్కచెయ్యగూడదని అనుకొన్నాను.

పగలు గడిచింది. రాత్రి తొమ్మిదిదాకా ఎక్కడుండేది చలికాలంలో? ఇదో చిక్కు. ఏదైనా ఒక మంచిపని చేయా

లంటే చిక్కులురావ్రూ మరి. ఆమాత్రానికి లొంగిపోకూడదని నిశ్చయించుకొని సినిమాకు వెళ్ళి తొమ్మిదిన్నరదాకా అక్కడ గడిపి, అప్పుడు యింటిదారిపట్టాను.

కాంతం విరహబాధ, వియోగవేదన ఏమైనా పడుతూ ఉంటుందా అని ఆలోచనలోకి దిగాను. నాటకంలో చూచిందాయె. నేను చెప్పిన విషయాలు విన్నదాయె. ఇక కాకపోతే హంసతూలికాతల్పము లేదు. కాబట్టి చిరిచాపమీదనే శయనించి, అంత ఘోరంగా చంద్రదూషణ చేయకపోయినా కాస్త విచారపడుతూ అయినా ఉండదా అనుకొంటూ ఇంటికొచ్చాను.

తలుపు వేసి ఉంది. తలుపుదగ్గరకెళ్ళి, తలుపు, తలుపు అన్నాను. ఆవేశంగా అమాంతంగా రావటం, గాఢాలింగనంచే ప్రియుడ్ని తృప్తిపరచటం జరిగితే బాగుందనుకొన్నాను. ఎంత సేపటికి తలుపు తియ్యదు. బైట వెధవ చలిగాలి, ఏమబ్బా కాంతం ప్రణయం చూపటంలేదు అనుకొన్నాను. ఇంతలో నాయిక ప్రణయకోపంలో తలుపు తీయకపోవటం కూడా కద్దు అని జ్ఞాపకం వచ్చి "ఓహో! అదిగామాలు ఇది" అని అనుకొని కొంచెం సంతోషించినాను. కాని ప్రణయకోపమైనా ఇట్టె పోవాలె. లేకపోతే మగాడికి కష్టంసుమండీ. వెధవచలి. వణుకొస్తుంది. నిజంగా సత్యభామలాగ ప్రణయకోపం అట్టే పట్టిందా చచ్చానే. అని అనుకొంటూ ఉండగానే వచ్చి తలుపుతీసింది కాంతం.

కాంతాన్ని చూచేసరికి కడుపు చెరువై పోయింది. వియోగబాధవల్ల కమిలిపోయిన మనిషి అల్లా ఉంటుందీ తెల్లనిచీర కట్టుకొని పూలుపెట్టుకొని, శుభ్రంగా.

తెగిపోయిన పూలహారాలు ఏవి? మెడలో ఉన్న ఆఒక్క గొలుసూ, తెగకుండానే ఉంది.

ఛీ! నేను చేసిన ప్రయత్నం అంతా వ్యర్థం అయింది అనుకొన్నా. నమిలి మింగేద్దా మన్నంత కోపం వచ్చింది. కాని దిగమ్రింగుకొని,

"నా రాకకోసం పాపం ఎదురు చూస్తున్నావు కాబోలు" అన్నాను.

"ఎదురు చూడటం ఎందుకు ఊరికెళ్ళినవాళ్ళు రాక పారి పోతారా!"

"అది గాదే. నీకు భర్తృవియోగం కలుగలేదూ?" అన్నాను.

"కలిగితే నేం."

"కలిగితే విరహతాపం పుట్టాలె."

"నాకేం పుట్టలేదు."

"నాకర్మం, నీకు పుట్టక పోవటం. నాయందు నీకు ప్రేమ లేదన్నమాట. సత్యభామకు ప్రేమఉన్నది కాబట్టి అట్లా పుట్టింది ఆమెకు" అన్నాను.

"దానికేం వచ్చిందో, పిల్లాజెల్లాలేని ముండలకేముంది, అయినా ఏమిటీ గోల?"

"నామీద నీకు ప్రేమ లేదన్నమాటే కదూ?" అన్నాను దీనంగా.

"మహాబాగా కనిపెట్టారు. మధ్యాహ్నం పాపం ఫలహారం చేశారోలేదో. అన్నంతిందాం రండి. అల్లంపచ్చడి చేశాను... తరువాత మాట్లాడదాం" అన్నది.

భోజనం అయినతరువాత "శాస్త్రసమ్మతమేనా పైత్యం?" అన్నది కాంతం తమలపాకులకు ఈనెలు తీస్తూ; కాని అప్పటికి నాకోటి తోచింది. మనం అట్టే ఈవిరహం గిరహం ఆమె బుర్రలోకి ఎక్కిస్తిమా అంటే ప్రణయకోపాలు నిజంగావచ్చినాయా, చలిలోను ఎండలోను వానలోను బైటపడి ఉండటం జరుగుతుందని జ్ఞాపకానికి వచ్చింది. అదీకాక ఆకలితో మాడిపోతూ నేను ఇంటికొస్తే, అప్పుడు వెంటనే ఇంత పచ్చడి అన్నం పెట్టింది. హాయిగాతిన్నాను. విరహమూ అదీ నేర్పామా అంటే చావే అని అనుకొని అయినా కాంతంతో బింకానికి "నీకు నిజమైనప్రేమ ఉంటే భర్తృవియోగం కోసం దుఃఖపడుతూ ఉండవా!" అన్నాను.

"చాలుచాలులెండి, నాటకాలకు వెళ్ళొద్దంటే వినరుగా? చెపుతాను జరగండి" అన్నది. కాంతర్ధ్రీ

# ప్రణయలేఖలు

౧

మళ్ళీ అదేమోస్తరు. ఉత్తరం రావటంతోనే నాముఖం

కళా విహీనం అయిపోయింది. ఏదో గొప్ప నేరం చేసిన వాడి లాగ ఆందోళన పొంది ఆఉత్తరాన్ని పుస్తకాల వెనుక్కి తోసేస్తుంటే ఎక్కడినుంచి వచ్చిందో అనసూయానికి గానే వచ్చిందికాంతం. నేను తెల్లమొఖం వేయటం చూచి 'ఏమిటి చేస్తున్నా'రన్నది. ఏంచెప్పేది, ఏంలేదు అన్నాను. 'ఏం లేక పోవడమేమిటా, ఏదో ఉంది, చెప్పరాదూ?' అంది కాంతం అసూయాగ్నిని కళ్లల్లో వెలిగించుకొంటూ.

"మున్న వచ్చిందే ఆ మాస్టరు ఉత్తరమే వచ్చింది" అన్నాను. 'ఇంకేం? ఉత్తరాలు వ్రాసుకోండి అని' అసూయతో దగ్ధం అవుతూ వున్న హృదయంతో వెళ్లిపోయింది. అసలు విషయం ఏమిటంటే నామీద ఆవిడకు ఏదోలోపలుంది.

ఈ అనుమానానికి కారణం ఏమిటంటే ఒకరోజున నేను పనిమీద పొరుగూరు వెళ్లటం తటస్థించింది. ఆరోజే ఒక ఉత్తరం వచ్చింది నాకు యెక్కడి నుంచో. అందులో ఒకపంక్తి మాత్రం ఇంగ్లీషు వ్రాసి ఉంది. సాధారణంగా నావుత్తరాలు మా ఆవిడ చూడదు. చూడాలన్న కుతూహలము లేదు కాని ఇంత క్లుప్తంగా వ్రాసి ఉంటం మూలాన ఏమిటా అని ఆవిడకు కుతూహాలం కలిగింది. ఇంగ్లీషు బహుకొద్దిగావచ్చు అంటే అక్షరాలు గుర్తుపట్టటం బాగావచ్చు. పరిచయ శబ్ద సము దాయము ఒక నూరు మాటలకు మించి యుండదు.

ఉత్తరంలో Please remember అని ఒక్క చిన్న వాక్యమే ఉండటం మాపోట్లాటకు అంతా మూలం. చావు

[illegible]బులో ఏమైనా అని భయం వేసిందట పాపం. క్రింద సంతకం [illegible] శేషం అని ఉంది. Please అంటే తెలుసు కాని, remember అంటే తెలియదు. అందుకని వారపు కుర్రవాడికి చూపి 'జాబులో ఏముంది అబ్బాయి' అని అడిగిందట.

వాడి తెలివి చూడండి! నాకర్మం కాలి తే! "నన్ను ఎల్లప్పుడు జ్ఞాపకం వుంచుకో అని యెవరో వ్రాశారండీ" అని, క్రింద సంతకం ఎవరిది అంటే 'శేషు అనే అంతవరకు అక్షరాలు స్పష్టంగా ఉన్నవి. అక్కడ నుంచి వంకర గీతలు తప్ప యేమి తెలియటం లేదు.' అన్నాడట. సరే వాళ్లిద్దరికి ఒకే అభిప్రాయం కలిగింది. ఒక స్త్రీ వ్రాసి వుంటుంది అని శేషు అనివుంది కాబట్టి, శేషమ్మ అనో శేషారత్నం అనో శేషగిరి అనో పేరుగల స్త్రీ వ్రాసిన ఉత్తరం అని గట్టి నమ్మకం కలిగింది.

2

చలిదినాలు కావటంచేత ఆరోజు పెందలాడే భోజనం చేసి మంచాలమీద చేరాము. కాంతం కథ సాగించింది.

"అయిందా అండి. అప్పుడు ఆముండ ఎవరా అని ఊహా ఆలోచనలు పోయినవి."

'ముండ ఏమిటి?'

'అదే! ఆ ఉత్తరం వ్రాసింది.'

'ఉత్తరం వ్రాసినంత మాత్రాన తాడు తెంచావు?'

'ముండ కాకపోతే ముత్తైదువా. అంటే మొగుడి

యందు భక్తివిశ్వాసాలు కలవాళ్ళు పరాయి వాళ్ళకు వుత్తరాలు వ్రాస్తారావమిటి ?'

'ఎవరైనా స్నేహితురాండ్రు నాకు వున్నారని ఊహించక పోయినావా.'

'మీకూ ఆడువాండ్లకూ స్నేహమంటే ఒకటి. ఇదిలాంటే ఒకటా ? మొగవాడికి ఆడదానికి మధ్య ఉండగల సంబంధం ఒక్కటే. అది భార్యాభర్తలమధ్య వుండటం సమ్మతం, పర స్త్రీతో ఏరకపు సంబంధమైనాసరే వుండటం అసహ్యం.'

'సరే, సరే నిన్ను సమ్మించటం నా తరంగాదుగదా నన్ను పుట్టించిన వాడికైనా చేతకాదు. అది అట్లా ఉంచి ఏమి జరిగింది చెప్పు.'

'ఏముంది మీరు ఎవరితోనో స్నేహం చేశారని' అని నాకు స్పష్టమైంది '

ఊ అని చిరునవ్వు నవ్వి కాంతం చిక్కిపోయిన చెక్కిళ్ళను చూచి 'నాకు నాపిల్లలకు సేవచేయటంలో కదా ఈమె చెక్కిళ్ళు చిక్కి, హస్తములు కఠినమైనవి' అని అనుకుంటున్నాను.

'మళ్ళీ మీ మొఖం చూడాలని నేను అనుకోలేదు. ఇల్లు తగలబెడదా మనిపించింది. మా సెథప ఆడబిడ్డ మాచమ్మ నాకంటె సుఖపడుతోంది అనుకున్నాను. మీపుస్తకాలన్నీ ఈమాత్రం జ్ఞానం మీకు ఇయ్యలేని పుస్తకాలన్నిటిన్నీ ఒక మాటు నిప్పు అంటిద్దా మనుకొన్నాను. కాని ఆక్షణంలో పెద్ద పిల్ల బడినుండివచ్చి అన్నం పెట్టమనటం, చంటిది కెవ్వున

కేకేసి ఒక్క పెట్టున ఏడవటం నా నిశ్చయాన్ని కార్యరూపం చెందకుండా ఆటంక పరచినవి.

'పిల్ల పడ్డకపోయినట్లయితే యీపాటికి నీకు మాచమ్మ రూపు వచ్చేదన్నమాటే !'

'ఊరుకొండి, అమంగళ వాచకాలన్నీ...............'

'నిజన్న మాటేకదా!...'

'ఊరుకోకుంటే—ఇక పోనియ్యండి. సరే పిల్లకు పాలిచ్చి పెద్దదానికి అన్నం పెట్టేసరికి మూడైంది. పొంగు చల్లారినా జ్వాల సాగుతూనే ఉంది. కడుపులో మంట పుట్టింది. వళ్ళు తేలిపోవటం మొదలుపెట్టింది. తలకాయ బద్దలు కొట్టుకొంటే బాగుండననిపించింది. కాని పిల్ల కోసం ఏమి చేయలేక అబలనై ఊరుకొన్నాను.'

'మంచిది, మంచిది' అని నేను దర్జాగా అన్నాను. నావంక కోరచూపులు చూచి 'దేని విషయమై నిజం ఏమిటో మీరు చెపుతారా? నన్ను ఎందులోనన్నా పడి చావమంటారా ?' అన్నది చివరకు బాకులతో పొడిచినట్లు చూస్తూ.

ఆఖరుమాట వినేసరికి నాగుండె ఝల్లుమన్నది. ఆవిడ అంత పనీ చేస్తుంది. మహా మొండి. సాహసి. ఏంజేసేది. నిజమేమిటో నాకే తెలియదాయె. ఆవుత్తరం వ్రాసిన దెవరో నాకు దెలియలేదు. పేరుమాత్రం ఏదో అర్థంగానే ఉంది. S...h అని రెండు అక్షరాలూ, తరువాత వంకరగీతలు కనపడుతున్నవి. అయితే ఎవరు వ్రాశారో యీవుత్తరం నాకు తెలి

యదు. స్త్రీ మాత్రం కాదు. ఏమో, ఏమిటో మాయగానే ఉంది. "నామాట నమ్ము. నేను ఏ స్త్రీతోను స్నేహం చేయ లేదు. నన్ను అనవసరంగా ఎందుకు అనుమానించి గృహంలో కల్లోలం తీసుకొస్తావు. నిజం నిలకడమీద తెలుస్తుంది." అని దీనంగా వేడుకొంటున్న గొంతుతో మనవి చేసికొని గడ్డం పట్టుకొని భోజనం చెయ్యమని బ్రతిమిలాడినాను. వెళ్ళి రెండు మెతుకులు కొరికింది. కాని ఆరాత్రి తెల్లవార్లు కాంతం మంచం మీద మసులుతోనే ఉంది......దగ్గరకు వెళ్ళితే కరుస్తుందని భయంవేసింది. శాలువ ముసుకు బిగించుకొని నిద్రపోయినాను.

## 3

రెండు రోజులదాకా ఇంట్లో ఎవరిసంగతి వాళ్ళదే. ఒకళ్ళ సంగతి ఒకళ్ళకి పట్టదు. విస్తట్లో అన్నంపెడితే తినటం. నాదారిన నేను వెళ్ళిపోవటం. ఆవిడ నాతో మాట్లాడలేదు. నేను ఆవిడను పలకరించనూ లేదు...... ఏ అఘాయిత్యంలేకుండా కాలం ఇట్లా గడిస్తే అంతే చాలునని నాగోల. ఆవిడ కోపం కాలంగడిస్తే చల్లారుతుందని నా నమ్మకం.

ఇది జరిగిన వారంరోజులకల్లా మళ్ళీ ఇంకో ఉత్తరంవచ్చింది. అందులో రెండోమాటు చెప్తూవున్నాను. జ్ఞాపకం తెచ్చు కోండి అని వుంది. మళ్లీ అదే సంతకం. అయ్యబాబో! ఇదేదో నాకొంప తీయటానికే వ్రాస్తుందని అనుకొని రహస్యం బయటపడ్డదాకా ఈఉత్తరాలు చింపివేయటానికి ఇష్టంలేక పుస్తకాల వెనకాలకు తీసేస్తుంటే కాంతం రావటం, నన్ను

పట్టుకోవటం జరిగింది. అది సంగతి.

ఈ రెండోసారి ఉత్తరం సంగతిగూడా ఆవిడకు తెలిసింది. నను మానిజ రాసటంవరకు ఉన్న సంగతి చెప్పక తప్పిందికాదు. కాని మళ్లీ మొదటకొస్తుందేమో అనుకొన్నాను. కాని అట్టే ప్రమాదం కనబడలేదు. సముద్రం మధ్యను తుపాను పడితే తీరవాసులకు కొంచం భయకారణమైనా ఆపద లేనట్టే ఆమె హృదయ మధ్యమంలో ఏంపుట్టిందో అక్కడే అణగిపోయింది.

అయితే ఎవరైనా స్త్రీ నన్నిష్టపడైనా కలుసుకొని మాట్లాడి ఇట్లా వ్రాస్తున్నదా అని సందేహంకూడా కలిగింది. అట్లా జరిగినట్లు జ్ఞాపకం లేదు. ఇదేదో మాయగా ఉంది. నాకూ ఊహాలు బయలుదేరినవి. అవన్నీ వట్టి పగటి కలలు సుమండీ!

ఒక చక్కని స్త్రీ నన్ను ఇట్లా ప్రేమించి, ఉత్తరాలు వ్రాస్తున్నదని నేను జబాబు వ్రాయకపోతే తానే వచ్చి నన్ను కలుసుకొంటుందని ఒక ఊహ. కలుసుకొంటే ఎట్లా! కాంతంతో చెప్పటమా? చెప్పకపోవటమా? చెపితే కొరికేస్తుందే! చెప్పకుండానే రహస్యంగానే జీవించటం. ఆమెవల్ల నాకు ప్రేమానుభవమేకాక కావలసినంత ధనసహాయం దొరుకుతుందనీ ఈ సేవకావృత్తి మానెయ్యవచ్చుననీ మరొక ఊహ. ఉద్యోగం మానేస్తే కాంతం కనుక్కుంటుందని మరియొక ఉపఊహ. సరే మానెయ్యకుండా జీవిద్దామని సహాయ్యఊహ. అక్కడ నుంచి కళ్ళముందు ఒక సినిమా ఫిలుము. మోటారులు,

తోటలు, విహారము, పెద్ద పట్టణాలు చూడటం, సినిమాలు, నాటకచేరీలు, ఏమిటో-ఏమిటో కనబడటం. ఇంతలో పసిపిల్ల వాడు కెవ్వున కేకేసి ఏడ్వటం, తల్లి చంటివాడికి పాలిస్తూ లేవటానికి వీలులేక "ఏమండోయి, ఏం, వినపడటంలేదూ, వాడు అట్లా ఏడుస్తుంటే ఊరికే చూస్తూ ఉంటారేం. లేచి ఎత్తుకోండి అనటం, విధిలేక ఎత్తుకోటం. ఇదొకనాటి.

తివాసీపై కూర్చుని బాలీసుపై జేర్లబడి మళ్ళీ ఏమిటా ఆ ఉత్తరం అని ఇంకోసారి ఆలోచనలోకి దిగటం. అయితే నన్ను ఏ స్త్రీ అయినా ఎందుకు ప్రేమించి ఉత్తరం వ్రాస్తుందా, నేను ఏమీ చక్కనివాడిని కానే, అని సందేహం కలగటం, అప్పుడు ఊహాప్రపంచములోనుంచి ఒక గంధర్వుడు 'నీవు నల్లగాఉన్నా ముక్కు, మొఖం బాగా ఉంటాయి. ముఖంలో వుండే వంపులు, రేఖలు అందంగా ఉంటవి. నిజమైన అందం రంగులో లేదు' అని నచ్చచెప్పటం. అవశ్యంగా ఒక విద్యావతి నన్నూ, నా తెలివినీ, నా కథారచనా నైపుణ్యాన్నీ గ్రహించి, మెచ్చుకొని నాతో స్నేహం కోరిందని అనుకోటం, అక్కడ నుంచి ఈ ఊహలు పూర్వము మోస్తరుగానే. సుకుమారితో స్నేహం, అయితే ప్రతిమారు ఆమె ధనవంతురాలు కావటం మాత్రం తప్పదు, నా దరిద్రం అంతా మాయం కావటం. కుచేలునికి ఐశ్వర్యం వచ్చినట్లు, అల్లాఉద్దీనుకు కావలసినదల్లా ఇచ్చే దీపపు సెమ్మె దొరికినట్లు నాకు ఆమనిషి, ప్రేయసి అనాలె -కాబోలు, దొరకటం, అక్కడనుంచి పూర్వము మోస్తరే

ఊహాలు రావటం పిల్లలకు సొమ్ములు చేయించినట్లూ, కాంతానికి ఒంటినిండా నగలుకొన్నట్లూ ఊహాలు. ఇక అంతుందా ఈ ఊహాలకు!

ఇంతలో పసివాడు గిన్నెలో తలకాయపెట్టి అది అందులో ఇరుక్కొని పోవటంమూలాన ఏడుస్తూఉండటం. చంటిది వంటినిండా పుండుకొని మంచంలో పొర్లుతూ ఉండటం, తల్లి పాత్రగుడ్డలు దొడ్లో ఉతుకుతూఉండటం ఈ hard reality చూసేసరికి నాగుండెల్లో అదేదో ఒకమాదిరిగా ఉండటం, ఇది ఇంకో అనుభవం. నా ఊహాకు సంబంధించిన కోరికలు ఇట్లా ఉన్నవి.

ఇక ఇంట్లోసంగతి. సంతోషం కాని నవ్వులాటలుగాని లేవు. జీవితం ఒక బండ మోయటం అనిపించింది. ఇంట్లో ఇల్లాలు ముక్కు ముడుచుకొంటే మగవాడికి ఎంత బరువో నాకు బోధపడ్డది. ఎట్లా ఈ సుడిగుండంలోనుంచి బైటపడాలో నాకు బోధపడలేదు. ఏపాపము ఎరుగని నాకు యీకర్మం ఏమిటి? ఇంటికి రావటం మానేద్దామా, లేకపోతే ఆత్మహత్య చేసుకొందామా, అని ఆలోచనలు బయలుదేరినవి. భార్యాభర్తల మిద్దరం యిట్లా వున్నాము. ఏమి చెయ్యాల్సింది తోచలేదు.

ఇంకోవారం గడిచింది. నేను బజారెళ్ళి పిల్లల కేదో తినే వస్తువులు కొనక్కొని ఇంటికొచ్చాను. మా అబ్బాయి నన్ను వీధిలోనే, పరుగెత్తుకుంటూ, వచ్చి కలుసుకొన్నాడు. పెద్దది అరుగుమీద నుంచుని చూస్తున్నది. రెండోది నాన్న, నాన్న

అనిగంతులేస్తున్నది. ఎడబిడ్డ తల్లి చంకలోనుంచి దూకుతున్నాడు.

గడప ఎక్కడంతోనే పసివాడ్ని అందించింది. సంతోషంతో ఎత్తుకొని ఉయ్యాలలో కెవ్వున కేకపెట్టి ఏడుస్తున్న దాన్ని ముద్దెట్టుకొని తెచ్చిన వస్తువులు పిల్లలకిచ్చి ఉయ్యాలలో దాన్ని ఎత్తుకొన్నాను.

ఇంతలో తల్లి వచ్చి పసివాడ్ని తీసికొని పాలిస్తూ నా యెదుట కూర్చుని.

'శేషాచార్యులు యెవరండీ? అన్నది నవ్వుతూ.

'ఏ శేషాచార్లు' అన్నాను.

'ఎవరో శేషాచార్లు తెనాలిట' అంది ఆవిడ విరగబడి నవ్వుతూ.

ఆయన నా స్నేహితుడే, ఆయన ఏమైనా వచ్చి ఏదైనా చెప్పాడా యేమిటి అని భయం వేసింది. కాని నవ్వుతోంది కాబట్టి ధైర్యం తెచ్చుకొని,

'నాస్నేహితుడు ఒకాయన తెనాలిలో ఉన్నా' డన్నాను.

'ఆయనమీద మీరు కేసు పెట్టాలే' అన్నది.

'ఎందుకు? ఆయన ఏంచేశాడు?'

'ఏం చేశాడా? ఇంతకంటె ఏమి చేయాలె?'

'ఏం చేశాడో తెలియందే!'

'మనిద్దరికు పోట్లాటపెట్టి, పదిహేను రోజులు, సౌఖ్యంగా కాలం గడిపే కుటుంబములో రగడ తెచ్చిపెట్టాడు.'

ఆయన మంచివాడు పాపం! ఏం చేశాడు? ఆయన ఎప్పుడైనా ఈ ఊసు రాందే? ఏమిటీ నవ్వు? ఈధోరణి ఏమిటి? [illegible]. 'చూడండి! ఇదుగో ఉత్తరం' అని నాముందు పారవైచింది.

అందులో "మీకు రెండుమాట్లు జ్ఞాపకం తెచ్చుకోమని వ్రాసినా ఏజవాబు వ్రాయకపోవటం మూలాన మీబావమరిది దగ్గరనుండి అడిగి పుచ్చుకొన్నాను మీరు ఇవ్వాలిసిన అయిదు రూపాయలు" అని ఉంది. నాకు నవ్వురాలేదు సుమండీ. అయితే యీనవ్వుకు పూర్వము మూస్తరుగనే ఉంది. 'నీకెట్లా తెలిసింది. శేషాచారిగారు అని' అన్నా.

"అమ్మా, మామయ్య వ్రాసిన ఉత్తరమేదే" అని అమ్మాయిని పిలిచింది, అది తన పెట్టెలోనుంచి ఒక కార్డు తెచ్చి యిచ్చింది. అది వాళ్ళ అక్కయ్యకు వ్రాసిన ఉత్తరం. అందులో వాడు—బావను డబ్బును జాగ్రత్తగా వాడుకోని అప్పులు చెయ్యవద్దని చెప్పు. శేషాచారిగారికి అయిదు రూపాయలు ఇయ్యాలట. ఆయన వచ్చి మీ బావ పంపలేదు. నీవు ఈయమని నన్ను అడిగి తీసికెళ్ళాడు. ఇటువంటి విషయం ఇది మొదటిసారి కాదు. ఆయన అందరిదగ్గరా అప్పులు చేయటం, వాళ్ళొచ్చి నాగొంతుమీద కూర్చోటం—"అని వ్రాసివుంది.

నవ్వుక తప్పింది కాదు. కాని నిక్షేపంలాంటి కాపరంలో తగూ పుట్టడానికి కారణం, ఆయన వివరంగా విషయంవ్రాయక పోవటమేగదా? అదస్కతుచేయడంలో— ఆ అజాగ్రత్త ఏమిటి?

ఆ దస్తూరి ఏమిటి. ఆ క్లిష్టంగా వ్రాయటమేమిటి? దానివల్ల ఎంత గోలయింది. ఏమైనాసరే నాకు కలిగిన అసౌఖ్యానికి నష్టపరిహారార్థంగా ఆయనమీద పదిహేను వేలకు దావా వేయదల్చుకొన్నాను.

అమెరికా మొదలైన దేశాలలో ఇటువంటి దావాలు వేస్తారట. తప్పక దావా గెలిచి ఆయన వద్దనుంచి పదిహేను వేలు రాబడతాను. కాని ముందు కోర్టుఫీజుకూ, వాటికి రు 200 అయినా కావాలట. కాబట్టి ఈ కథ చదివి సంతోషించిన ప్రతివ్యక్తి, నాకు ఒక్కొక్క రూపాయి పంపండి. ఆడవాళ్లయితే అర్ధరూపాయి. పిల్లలు అయితే పావలా.

# నీ లి కొ ం డ లు

రాత్రి పదిగంట లయింది. పిల్లలు నిద్రపోయినారు. తమలపాకుల పళ్లెం ముందుపెట్టుకొని కాంతం నాముందు తివాసీపైన కూర్చున్నది.

'మన కమల సంగతి విన్నారా?' అని పలకరించింది కాంతం.

దీపంముందు కాంపోజిషన్ పుస్తకాలలో మునిగి వున్న నేను "కమల యెవరు?" అన్నాను.

"కమల యెవరా? అందాక వచ్చిందీ. మీ చెల్లెలు. కృష్ణయ్యచౌదరి కూతురు; చిన్నతనంలో మీరు పద్యాలు వ్రాస్తుంటే విని సంతోషిస్తుండేది."

"అవునే జ్ఞాపకం వచ్చింది. ఒకమారు ఆ అమ్మాయికి నేను ఒక పద్యం వ్రాసి వినిపిస్తే ఎంతో సంతోషించింది."

"ఏమిటా పద్యం."

"పద్యం జ్ఞాపకం లేదు. కాని అందులో భావం జ్ఞాపకం ఉంది. మీాప్రాళ్ళో రెండు కొండలున్నవి జ్ఞాపకంఉందా?"

"ఎందుకు జ్ఞాపకం లేదు. ఎదురెదురుగా వుండేవి మధ్య లోయ."

దానిని గురించే వ్రాశాను. ఏమనంటే ఆ రెండుకొండలు అట్లా యెదురుగా నుండి ఒకదాని నొకటి ప్రేమించుకొంటూ ఆలింగనంకోసం దేహాన్ని యెంత యెత్తునకు లేపినా, ఆ సౌఖ్యం దొరకడం లేదని. మధ్య ఏమి అడ్డం లేదుగదా? ఎందుకు అవి కావిలించుకొని ఐక్యం అయిపోవు......అని వ్రాశాను,

"అప్పటినుండి ఉందీ మీా కీ పిచ్చి? సరే ఆకమల సంగతే ఇప్పుడు చెప్పుతా."

"ఏమిటీ?"

"అంత ఆగడం పనికిరాదు ఆడదానికి" అన్నది కాంతం.

"ఏమిటి ఆగడం" అన్నాను.

"మగడ్ని వల్లకపోవటంకంటే ఇంకేమి కావాలె. లోకంలో పెళ్ళాన్ని పలకపోవటం విన్నాను కాని భర్తను వల్లకపోవటం వినలేదు. ఎక్కడైనా ఉన్నా, దానికి ఆడదాని ఆగడం తప్ప ఇంకో కారణం లేదు."

"కాంతం, ఒక్కమాటవిను. ఆమె మంచి మనిషి అని నీకు తెలిసిన విషయమే కదా! అటువంటి భాగ్యశాలి మొగుణ్ని వల్లకపోవటానికి తగినంత కారణం ఉంటుందంటావా లేదా! ఒక అల్లర చిల్లర మనిషైతే అనుకోవచ్చు"

"అదే నేననేమాట. నిక్షేపంలాంటి మొగుడు. రూపంలో, బుద్ధులలో వేలు ఎత్తి చూపటానికి అవకాశం లేదామె. ఏదో ఇంగ్లండులో నున్నప్పుడు కొంచెం ధనవ్యయము చేశాడనికోపం మనస్సులో పాతేసుకొని రానంటుంది. ఎంతగడుసు!"

"అయితే మొదట్లో యిద్దరు అనురాగంగా వుండే వాళ్ళేనా?" అన్నాను నేను.

"సారే! మళ్ళీ మొదటి కొస్తారేం. చెడ్డొచ్చాడు మొద లాడ మన్నట్లుంది."

"పరధ్యానంగావుండి వినలేదు. వెధవ పుస్తకాలు ఈ కాంపోజిషన్ పుస్తకాలు దిద్దటంలో నాజీవితసారమంతా హరించుకు పోతోంది. మొదట ఏదో అచ్చమ్మ కబురు అనుకొన్నాను. కాని చివరకు నీవు అంత ధనవంతుల బిడ్డ, నిక్షేపంలాంటి భర్తను వదిలేసిందనగానే యీవిచిత్ర మానసికప్రవృత్తి నా మనసును ఆకర్షించింది. వాళ్ళ సంగతి మొదటనుంచీ చెప్పు, నీకు బాగా తెలుసుగా."

"ఏముంది కమల, రామకృష్ణుడు మేనత్త మేనమామ బిడ్డలు. కమల తండ్రికి వంద ఎకరాల మాగాణి. ఆయన ఆ ఊరిలోకల్లా పెద్దరైతు. ఆలోగిలి పెద్ద దివాణంలా ఉంటుంది.

నౌకరులు చాకరులు కవతగాళ్ళు పాలేరులు ఆ ఇంట్లో ఊడిగం చేస్తూ ఉంటారు. పది ఆవులు పాడి. ఎనుబోతు గేదెలున్నాయి. దుక్కిటి ఎద్దులు యెన్నో నాకు తెలియదు."

"తెలియకపోతే మానెలే, అసలు సంగతి చెప్పు."

"మానాన్న ఆయనను బావా అని పిలిచేవాడు. కమల నాకు వదినె వరస. కిమ్మం సంవత్సర్లు కాబట్టి పెద్దమనిషి అయిన తరువాత పెండ్లి మాటలు వచ్చినాయి.

"కమల నాతో ఎప్పుడూ వాళ్ళబావమాట్లు చెప్తుండేది. ఆయన చక్కని వాడనీ, సుగుణవంతుడనీ చెప్పటానికి ఆవిడకు విసుగు లేకపోయేది. ఎప్పుడైనా వాళ్ళింటికి వస్తే గబగబా పరుగెత్తి వచ్చి నాకు చెప్పి నన్ను పిలచుకొనిపోయి వాళ్ళ బావని నాకు చూపేది. ఇద్దరం తలుపు చాటునుంచి ఒక మాటు, వంట యింట్లోనుంచి ఒకమాటు, స్నానానికి వెళ్ళేటప్పుడు ఒకమాటు, బజారు వెళ్ళిపోతుంటే వెనకనుంచి యింకో మారు ఆయనను చూచేవాళ్ళం. కమల మొత్తంమీద బావ అంటే పంచప్రాణములు వదిలేది" అన్నది కాంతం తాను తీస్తున్న తమలపాకుల ఈనెలు నామీద విసిరి.

"సరే, ఆమె ప్రేమను గురించి ప్రసంగం మాని అసలు విషయానికి రా" అన్నాను నేను.

"వస్తున్నాను ఉండండి మరి. సరే పెండ్లి అయింది. కమల అత్తవారింటికి కాపరానికి వెళ్ళకముందే ఆయన బి. ఏ. ప్యాసు అయి ఇంగ్లండు ప్రయాణం కట్టాడు."

"సంవత్సరాది పండుగకు మీరు, ఆయన వాళ్ళ నడవలో వడ్లబస్తాలమీద కూర్చుని ఆయన ఇంగ్లండు ప్రయాణాన్ని గురించి మాట్లాడారు జ్ఞాపకం లేదూ ? మీరు ఆయనను పొమ్మని ప్రోత్సాహం చేస్తుంటే కమలా, నేనూ విన్నాము. మీమీద మాకు ఎంతో కోపం వచ్చింది. కాపరానికి వచ్చిన కొత్త రోజులు కావటంమూలాన మాట్లాడలేదు. లేకపోతేనా" అన్నది కాంతం. తాంబూల రక్తముతో తళతళలాడే ఆ చిరు పెదవులు చలించి పోయినవి.

"ఆపు — ఆవాక్యము పూర్తిచెయ్యకు, కమలసంగతి కానీ. మన కమల ఏదో అమాయకపుపిల్ల అనుకొన్నాను గాని దాని హృదయంలో ఇంత ప్రేమ ఉందని నేనెప్పుడూ అనుకో లేదే ! నన్ను అన్నయ్యా అని పలకరిస్తుండేది కదే ?"

"అవును. ఇంగ్లండు వెళ్ళటం ఆమెకు ససేమిరా ఇష్టం లేదు, వద్దన్నది. బతిమిలాడింది. కాళ్ళావేళ్ళాపడ్డది. ఆయన ఆమెమాట తోసివేసి నీకు తెలియదు ఆడదానివి, అందులో పల్లెటూరుదానివి. విద్యవలన కలిగే ఉపయోగాలు తెలియవు. అని యేదో పెద్ద కబుర్లు మాట్లాడి వెళ్ళిపోయినాడు. కమల వాళ్ళ బావను వదిలిన దగ్గరనుంచి యెంత క్రుంగి పోయిందో నాకు తెలుసును. ఇంగ్లండులో ఆయనకు ఆరోగ్యముగా ఉం టుందో వుండదో అని, యెప్పుడొస్తాడో అని, ఆ దేశంలో ఉండే దొరసానులను పెండ్లాడుతాడేమోనని, ఏవేవో పిచ్చిభయాలు పెట్టుకొని ఊ కళ్ళనీళ్ళు తిప్పుతూండేది."

"అవును, నన్ను ఆరోజులలో ఇంగ్లండు సంగతులు అవి ఇవి అడిగి అక్కడ దొరసానులు చక్కనివాళ్ళు ఉంటారా అని అడుగుతుండేది.

ఆపళంగా కాంతం ఒక్కమాఱుగ కథ ఆపేసింది. నా ప్రసంగానికి మధ్యవర్తిగా ఉన్న మా చిన్నదీప మిదివరకు కథతో పాటుగా తల ఊగించుచున్నది ఒక్కమాఱుగా నిలబడి పోయింది.

"ఆవిడ భయం పాపం అది. దానితరువాత ఉత్తరాలు వ్రాసింది. మనకేమి తక్కువ, మీకు కావలసినంత పొల మున్నది. నాకూ ఆస్తి ఉన్నది. మనకు ఈ యెడబాటు యెందుకు? గొప్ప ఉద్యోగాలు లేకపోతేనేం అని యెన్నో విధాల వ్రాసింది.

ఆయన వినలేదు. యెంతచెప్పినా వినలేదు. మొదటి సంవత్సరం పది ఎకరాలు అమ్మారు. తరువాత యింకా పది, మూడోసంవత్సరం తండ్రి తనవంతు నాలుగో అయిదో వుంచు కొని మిగిలినది అమ్మేసి కొడుక్కు పంపాడు. ఆస్తి అంతా అలికేసినట్లయింది. అయిదేండ్లయింది. కమల కొన్నాళ్లు ఏడ్చేది కాని తరువాత గుండె రాయి చేసికొని ఆమాట యెత్త కుండా తిరిగేది. ఎవరైనా ఆమాట యెత్తితే ముఖం చిట్లించు కొనేది. పిచ్చిచూపులు చూసేది. ఏదో క్రోధం ఆమె చూపు లలో ముళ్ళలాగు వుండేది. దాని తరువాత మనం ఈవూరు వచ్చేశాము. ఏమిజరిగిందో నాకు తెలియదు. ఇప్పుడు ఆయన

వచ్చాడని, ఆమె ఆయన దగ్గరకు పోలేదని తెలిసింది. నాకు ఆశ్చర్యంగా వుంది. కోపం ఉంటే మట్టుకు భర్తను వదిలేస్తుందా? ఏమిటీ ఆగడం!" అన్నది కాంతం.

ఈ ప్రశ్నమాత్రం కొంత జవాబు నాశించే వాక్కుతో విని తన యభిప్రాయాన్ని మార్చుకొంటానికి వీలుందేమో అనిపించేటట్లు అన్నది.

"నేను వినటం ఏమిటంటే" అని నేను అందుకున్నాను. పాపం ఆయన ఇంగ్లండునుంచి వచ్చి భార్యను చూడటానికి వస్తే ఆమె ఏమీ సంతోషించక కోపంగా చూచిందట. మాట్లాడ లేదట. ఆయన వున్న నాలుగురోజులూ ఆయనను సర్వ భ్రాంతితో చూసేది. పాపం ఆయన యెంతో చెప్పాడట. ఆస్తి పోతేపోయింది, బీదవాళ్ళమైనా, ఏదో ఉద్యోగంలో చేరి సుఖపెడతా నన్నాడట. ఆమె ఏమాత్రం చలించక రాతి గుండెతో ఆయనను నిరాకరించిందిట.

తరువాత ఉద్యోగం దొరికింది. నెలకు రు 250 లు జీతం. పెద్ద యిల్లు పుచ్చుకొని సామానులు కొని క్రొత్తచీరలు కొని భార్యకు ఆవిషయం తెలియజేస్తూ ఉత్తరం వ్రాశాడు. కబురు పంపాడు. ఎన్ని జేసినా ఆమె మనస్సు మార్చుకోకపోవడం మూలాన ఊరుకున్నాడు ప్రాణం విసిగి.

"కోపంకామాలు" అన్నది కాంతం

విను, ఒకరోజున రామకృష్ణచౌదరికి చాలా జబ్బుగాఉందని కబురు వచ్చింది. మేనమామ కూతుర్ని తీసికొని చెన్నపట్నం

వెళ్ళారు. అల్లుడిన్ని చూచి నాలుగు రోజులుండి కూతుర్ని దిగ విడిచి వచ్చేశారు. వంటవాడు నౌకర్లు వుండటం వలన కమలకు చేసుకునే పనిలేదు. అయినా ఆవిడ భర్తకు భార్య ప్రేమతో సేవ చేయసాగింది. స్నేహితునితో వలె ప్రవర్తించింది. మందూ అవీ యిచ్చి వెళ్ళిపోతుండేది ఇంకోగదిలోకి.

దగ్గరకూర్చుని ఆవిడ పువ్వులలాంటి చేతులతో తన శరీరం తోముతుందేమోనని చౌదరి పాపం అనుకొన్నాడు. కాని ఆమె అర్థశూన్యమైన దృష్టితో ఆయన ప్రక్కనుంచుని ఏదో తాను చేయదలచుకొన్న పనిచేసి వెళ్ళిపోతుండేది.

ఇట్లా ప్రవర్తించటం మూలాన అతని హృదయంలోని ప్రేమ కాస్తా గ్రీష్మాతపమువలన యెండిపోయిన సెలయేటివలె అయింది.

ఇప్పుడు వాళ్ళిద్దరు ఒక ఇంట్లోనే ఉంటారు. రోజూ మాట్లాడుతారు. ఒకసారే భోజనం చేస్తారు. ఒక గదిలో కూర్చుని దేశస్థితిని గూర్చి మాట్లాడుకొంటారు. వారి దాంపత్యం మూర్తీభవించిం దింతమట్టుకే. ఏమిటో వారిద్దరికి అడ్డంవచ్చింది.

“వాళ్ళవూళ్ళో ఉన్న రెండు పెద్దకొండలు ఎదురు బొదురుగా ఉండి మధ్యనేమి లేకపోయినా ఒకదాని నొకటి కావలించుకోకుండా యెందుకున్నదో అందుకే వీరిద్దరును ఒకరి నొకరు ప్రేమించుకొన్నా ప్రతివ్యక్తి ప్రేమా కొండంత ఉన్నతమైనా పరస్పర సమీపంలో ఉన్న కలయికకు ఊగుతున్నా అట్లా

యెదురు బళ్ళుగా ఒకరి నొకరిని చూసుకొంటూ ఉండిపోయి నారు." అన్నాను నేను.

"బాగానే వుంది" అన్నది కాంతం. ఆ స్త్రీ స్వరంలో ఆవాక్యోచ్చారణలో ఒక మహత్తరభావ సాక్షాత్కారాన్ని అవలంబించ లేనివారిని ఈసడించుకోటం ప్రతిబింబించింది.

"అది విచిత్రమైన దైవసంఘటన అంటాను." అని నేను బ్రహ్మాండమైన జవాబు చెప్పాను.

'దానినే నేను ఆడదాని గడసుదన మంటా' అని తృణీక రించింది కాంతం.

'అంటే అనవచ్చు' అయితే వారికి ఇష్టం లేకపోయినా పర ప్రసాదంగా ఒకబిడ్డ కన్నట్టయితే నీవు ఏమనేదానివి అన్నాను.

'అదేనండి భార్యాభర్తల ప్రేమకు పరిపూర్తి సంతాన ప్రాప్తి. అది సంభవిస్తే ఇక అనుకోవలసిన దేమున్నది.'

అని ఒళ్ళో కూర్చుని స్తన్యపానము చేయుచున్న మూచంటి వాణ్ని బిగువు టూరుపుతో మూర్కొన్నది కాంతం.

"నీఉద్దేశం నాకర్థమయినది. భార్యాభర్తల ప్రేమకు ఉనికిపట్టు సంతానం. వారి ఇద్దరిప్రేమ నశించకుండా నిరం తరం పోషించేది సంతానం. కాబట్టి అది లేకపోతే కొరత పడ్డదన్నమాట అంతేకాదు? నీవు అనటం."

"అవును." అన్నదికాంతం మెరుస్తున్న కళ్ళతో.

"అప్పుడేముందిగొప్ప? మనమో స్తరు సంసారం అవుతుంది."

అన్నానునేను. "చాల్లెద్దూరూ" అని జడ వయ్యారంగా ఊపు కొంటూ ప్రక్కజూపులతో "పొద్దోయిందని" మాకాంతం పడక గదిలోకి దారితీసింది.

## కలమింటికోతి

పండగ వచ్చింది. పిల్లలు అప్పచ్చులు చేయమని మారాం చేశారు. కాంతం జిలేబి చేస్తానన్నది. తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి, అన్నారు. గారెలు చెయ్యమని నేనన్నా. పిల్లలకు తీపి యిష్టం, అవేచేస్తానని కాంతం అన్నది. కాసేపు తర్కించుకొన్నాము. చివరకు విసికిపోయి నేను ఊరుకోగానే విజయపతాకం ఎత్తింది కాంతం. జిలేబి చేయటానికి ప్రయత్నాలు మొదలుపెట్టింది. పోట్లాట ముదర కొట్టితే నాకే నష్టం, కాంతంమాట అట్లావుంచి. పిల్లలకోసం జిలేబి చేయకమానదు. తీరా నేను కోపం తెప్పించుకొని తినే సమయానికి తయారైతే నవ్వులపాట్లపని. అందుకని 'సరే ఏదో చెయ్యి. ఇంతకూ పిల్లలు తినకపోతే మనం చేసుకొని ఏమి ప్రయోజనం' అని నేను తగ్గాను.

ఇంతలో పెద్దపిల్ల వచ్చి 'అప్పచ్చులు చేశావుటే అమ్మా' అన్నది. చిన్నది గిన్నెచూచి ఏడుపు మొఖం వేసింది. పెద్ద పిల్లవాడు కర్రతీసికొని కొడతానంటున్నాడు. తరువాత పుట్టిన వాడు నాప్రక్కన కూర్చుని సంతోషంతో చప్పట్లు కొడుతున్నాడు. 'పిల్లలను కాస్త ఆడించండి, నేను ఇవి చేస్తాను' అన్నది.

కాంతం. 'అప్పచ్చు లేవే యింకా చేయలేదేం' అని అబ్బాయి చిన్నబెత్తం పుచ్చుకొని తల్లిదగ్గరకు పోయినాడు.

కాంతం — ఒరే, దానితో కొట్టావా కోతికి అప్పగిస్తా.

అబ్బాయి — ఏవీ, కోతులు?

కాంతం — ఉన్నవిలే.

నేను — ఒక కోతేగదే మనయింట్లో ఉంట్టా.

కాంతం — ఒక కోతేం చాలా ఉన్నవి.

నేను — కోతి అంటే జ్ఞాపకంవచ్చింది. ఒక కథ చెప్పేదీ?

కాంతం — చెప్పండి పోనీ.

పెద్దపిల్ల — చెప్పునాన్న — సుసీ, రావేవ్, నాన్న కథ చెపుతున్నాడు.

అబ్బాయి — కతా, నాన్న — చెప్పు.

నేను — చెపుతా, నీవుకూడా వినవే.

కాంతం — వింటున్నా చెప్పండి.

నేను — పూర్వం ఒకాయన —

కాంతం — చాలులెండి — ఉరుకోండి.

నేను — కథ వినరాదూ.

కాంతం — మీరుచెప్పే కథ నాకు తెలుసు.

నేను — వినరాదు తెలిస్తేమటుకు ?

పెద్దది — చెప్పునాన్నా.

నేను — అమ్మ వద్దంటుంటే!

పెద్దది — అమ్మా చెప్పనియ్యవే.

కాంతం — వొద్దమ్మ అది బాగుండదు.

పెద్దది — ఆఁ బాగుంటుందే.

కాంతం — బాగుండదమ్మా.

పెద్దది — కాదే బాగుంటుంది. నాన్న చెప్పే కథలు అంచక్కా ఉంట్టాయే.

కాంతం — మీరు ఆకథ చెపితే నేనిక్కడ ఉండను.

నేను — ఉండకేమి చేస్తావులే.

పెద్దది — పోనీనాన్న! నేనుంటా చెప్పునాన్న.

నేను — వినమ్మా— ఆయన ఒకరోజున బజారునకు పోతుంటే..:.........

కాంతం — ఉండండి నేచెప్తా. ఒక చక్కని స్త్రీ కనుపించిందట.

నేను — కాదు. కాదు.

కాంతం — మీరుండండి. నేను చెబుతాను అడ్డంరాకండి. ఆమె చక్కదనాన్ని చూచి ఆయన మూర్ఛపోయినాడట. మొగాన నీళ్ళుచల్లితే లేచాడట.

నేను — అబ్బే, అది కానేకాదు.

పెద్దది — చెప్పు నాన్న.

నేను — ఒక కోతి కనిపించింది.

అబ్బాయి — కోతా, నాన్న, కోతిని నేజూచా.

నేను — ఎక్కడ జూశావురా?

అబ్బాయి — మనయింటికి వచ్చింది నాన్నా.

నేను — అవునురా, నాయనా. మన యింటికొచ్చి 8 ఏండ్లు అయింది.

అబ్బాయి — ఏమే, అమ్మా.

కాంతం — ఛా ఉరుకో, వెధవ. ఆడుకో పో.

అబ్బాయి — ఏమో నాన్నా, ఎన్ని ఏండ్లు అయిందో నాకు తెలియదు. కోతినిచూశా నాన్న, అంచక్కాగ ఉంది.

నేను — చక్కాగ ఉందిరా?

అబ్బాయి — ఏమే అమ్మా? అంచక్క ఉండ దే?

కాంతం — నన్నడుగుతావేంరా! పో వెధవ, పోతావా పోవా?

అబ్బాయి — చూడు నాన్న, అంచక్కఉండదు నాన్న?

నేను — ఉంటుందిరా, నాన్న, నాకళ్ళకు అంచక్కా ఉంటుంది.

పెద్దది — కథ చెప్పు నాన్న, ఆః కోతి కనిపిస్తే...

నేను — ఆకోతిని చూచి ఆయన హడలిపోయి నిలుచున్న పాటున నిలువునా కొయ్యబారిపోయినాడు.

పెద్దది — కొయ్యబారితే ఏమైంది నాన్న?

నేను — కాసేపు అల్లాగే నిలువబడి మొగాన చేతులు పెట్టుకొని......

కాంతం — చాల్లే ఊరుకోండి, ఎవరైనా నవ్విపోతారు, నాకు తెలుసులెండి. ఈ కథ ఆపండి.

నేను — తెలిస్తే వినరాదు, అమ్మాయి విన్నట్లే,

కాంతం — సరే, వెక్కిరించటానికి తయారవుతారు తమరు మహా అందగాళ్ళయినట్టు.

పెద్దది — చెప్పు, నాన్నా, కథ; ఊరుకోవే అమ్మ.

అబ్బాయి — కోతిమొగాన చేతులుపెట్టి ఏంజేశాడు నాన్న

కాంతం — బుగ్గగిల్లి ముద్దెట్టుకొన్నాడు.

అబ్బాయి — ఛీ, ఎక్కడైనా కోతిని ముద్దెట్టుకొంటారా?

నేను — వాడికున్న జ్ఞానం నీకు లేకపోయె.

కాంతం — జ్ఞానం ఎవరికిలేదో కొంచెం ఆలోచించండి.

పెద్దది — ఏమిటె గోల నాన్న? ఎప్పుడు పోట్లాటేనా? కథ చెప్పు నాన్నా, కోతి ఏంచేసింది నాన్నా?

నేను — కోతి మొగాన చేతులు పెట్టలేదు, తన మొగానే చేతులు పెట్టుకొని......

అబ్బాయి — కోతి మొగాన చేతులుపెడితేనేం నాన్న?

నేను — కరుస్తుందిరా!

అమ్మాయి — నీవు నవ్వబోకేఅమ్మ. ఎందుకు అట్లానవ్వుతావు? చెప్పునాన్న.

నేను — అందుకని తన మొగాన చేతులు పెట్టుకొని భోరున ఏడ్చాడు.

కాంతం — భావకవి ఏమోనుమండి ఆయన.

నేను — నీకుకూడ అంటింది — ఈవిద్య, ఎక్కిరించటం.

కాంతం — ఎవరండీ ఆయన——

భోరు భోరున ఏడుస్తాను,
ఎన్నెవ్వరూ ఆదరించవద్దు,
ఏడ్చేడ్చి ఎక్కెక్కి ఏడుస్తాను,
చిట్టచివరకు నట్టేట్లో దూకుతాను.

అని వ్రాస్తాడు.

నేను — ఏం కాంతం — నీవు పద్యాలు వ్రాస్తున్నావే మహా తెలిసినదానిలాగే. అది నువ్వు ఏడ్చేలాగ అర్థంచేసుకో రాదు. కవులు అట్లా ఏడుస్తారు.

కాంతం — అందరూనా అండి.

నేను — కొంతమంది.

కాంతం — మీరుకూడ, కవులు కామూ లే?

పెద్దది — అమ్మా ఏమిటే ఆఁవ్వ. కథ చెప్పునాన్న.

నేను — ఎంతవరకుచెప్పాను - ఆఁ- ఏడ్చాడు.

కాంతం — ఛీఛీ, అంతా ఉండగానే.

నేను — ఏమిటి అట్లా అంటావు.

కాంతం — మీకథవిషయం కాదు. కుక్కవస్తున్నది.

నేను — ఏడ్చేటప్పటికి వాళ్ళువీళ్లు చేరారు.

పెద్దది _ చేరి ఏంజేశారు?

కాంతం — ఆయనను బజారులో గోల చెయ్యవద్దని నెట్టారు. నామాట వినవుటే అమ్మాయి.

పెద్దది — పో, నాన్నను జెప్పనీ, నాన్న కథ చక్కగా చెపుతాడు. చెప్పునాన్న.

కాంతం — నామాట వినవే; తల్లి దైవముగదక్కే!

పెద్దది — అవునులే.

నేను — నీవు దైవమువా?

కాంతం — అవును.

నేను — సుసీ, నేస్పుకో అమ్మా.

సుసీ — ఏమిటి నాన్నా.

నేను — తండ్రి దేవుడు.

సుసీ — తంది దేవులు.

నేను — తల్లిదైవము.

సుసీ — తల్లి దయ్యము.

కాంతం — అట్లా గాదమ్మా, తండ్రి దైవము.

సుసీ — తంది దయ్యము.

పెద్దది — ఏమిటి నాన్న, నవ్వుతావు - కథ చెప్పునాన్న.

నేను — వాళ్లు పిల్లు వచ్చి ఎందుకు ఏడుస్తున్నావు అన్నారు.

కాంతం — నాకర్మం అనలేకపోయినాడూ?

నేను — చెబుతున్నానుగా - ఇవ్వాళ నాభార్యా నేనూ పోట్లాడుకొన్నాము. అన్నాడు.

అబ్బాయి — అమ్మా, నీవూ పోట్లాడు కొంటావూ అత్తాగా?

పెద్దది — ఆ, పోట్లాడుకొంటే ఏడవటంఎందుకు నాన్నా?

నేను — ఆమెకు బాగా కోపం వచ్చి...

సుసీ — పోత్రాత ఎందుకో నాన్న;

నేను — ఆయన పండుగకు గారెలు చెయ్యమంటే ఆవిడ జిలేబి చేస్తానని పోట్లాడిందేమో?

కాంతం — కిన్నెరసాని గోదావరి కలసినయ్యే!

నేను — మరి కలుపుతున్నా - ఆవిడకు కోపం వచ్చి ఏదో తీసికొని వెంటబడ్డదట.

పెద్దది — ఏం తీసికొన్నదనాన్న?

నేను — తోటకూరకాడ ఏమో!

కాంతం — ఆగండి ఆగండి. ఆడదానికి ఆయుధాలు లేవా! వెంటబడటం దాకా వస్తే తోటకూర కాడ ఏమి లాభము. - శివుడికి త్రిశూలంలాగ - విష్ణుమూర్తికి చక్రం లాగ - అర్జునుడికి గాండీవంలాగ ఆడదానికీ ఉంది ఆయుధం.

నేను — నన్ను చెప్పనీ. తోటకూర కాడ తీసికొని వెంట బడ్డది.

పెద్దది — కాదు నాన్న.

నేను — ఊరుకో అమ్మాయి, చెప్పేది విను. నీవు ఆట్టే నవ్వక, కాంతం.

పెద్దది — వెంట బడితే?

నేను — ఆయన పారిపోయి బ్రతుకు జీవుడా అని బయట పడ్డాడట.

అబ్బాయి — పెళ్ళాం కొట్టింది నాన్న?

నేను — కొట్టబోతే పారిపోయినాడు.

పెద్దది — అమ్మ కొట్టొస్తే నేను పారిపోతానే అట్లాగా?

సుశీ — అమ్మ నీకు పెండ్లామేనా నాన్నా?

నేను — పెండ్లామే.

సుశీ — నిన్ను కొడుతుందా నాన్న, అమ్మ!

కాంతం — ఛీ ఊరుకో - ఏమిటండి పిల్లలకు మంచిబుద్ధులే చెప్తున్నారు.

నేను — కొట్టదే, ఎప్పుడైనా కరుస్తుందే.

పెద్దది — చెప్పునాన్న కథా.

నేను — తప్పించుకొచ్చి తిరుగుతుంటే కోతి కనపడే టప్పటికి పెండ్లాము జ్ఞాపకం వచ్చి, అదంతా జ్ఞాపకానికివచ్చి, భయపడి, ఏడ్చాడట.

అమ్మాయి — కథ బాగుందే అమ్మ!

కాంతం — కథా బాగుంది. మీనాన్నగారూ బాగున్నారు. సరేగాని కథ విన్నారు. అందరు చెవులు గిల్లుకోండి.

అమ్మాయి — గిల్లుకోడ మెందుకే అమ్మా? మేము గిల్లుకోము.

కాంతం వెళ్ళి పిల్లలందరి చెవులు కొంచెం కొంచెం గిల్లి వచ్చింది.

సుశీ — నాన్న చెవులుకూడా గిల్లవే అమ్మా!

నేను — నాచెవులు గిల్లక్కరలేదురా అమ్మనాన్నా! కళ్లు తెఱచినా మూసుకున్నా నాకు కోతి కనబడుతూనే వుంటుం దిరా?

కాంతం — ఇదిగో అప్పచ్చి.

పిల్లలంతా గల్లంతుగా ఒక్కసారి లేచారు నాకు కావాలె, నాకుకావాలె అని ముందు చంటివాడు లేసుకొన్నాడు. రెండోది పెద్దబ్బాయిది. మూడోది సుసీకి. నాలుగోది పెద్ద దానికి. అయిదోది నాకొచ్చింది. ఆరోది మాఅపెత తిన్నది.

# నా మ క ర ణ ం

పసిపిల్లను పక్కలో పడుకోబెట్టుకొని పురిటి గదిలో నులక మంచంలో పడుకొంది కాంతం. పండబారిన తమల పాకుల లాంటి చెక్కిళ్ళపై లేత గులాబి రేకుల పసిచేతులు నిమురు కుంటుంటే కెంపుపూలతో కాంతం తన మాతృత్వాన్ని పూజించు కుంటూన్నట్టున్నది.

పురిటిగది ప్రక్కన నేను మంచంపైన పడుకొన్నాను. కొంత దూరాన మాబావమరిది పడుకొని ఏదో చదువుకొంటు న్నాడు. కాంతం విప్పారిన నేత్రాంచలములనంటి కనీనికల దాకా ప్రవహించే తన చూపును సవరించుకొంటూ "మరి— పేరేమిపెడదాము." అన్నది.

"ఏమండోయి మిమ్మలినే."

"ఏమిటి?"

"ఈచిట్టితల్లికి పేరేం పెడదాము?"

" ఏదో ఒకటి పెడదాంలెద్దూ"

"అదిగాదండీ, రేపేగదా బారసాల. అప్పటికప్పటికి

ఏమీ తోచకపోవటం. ఏదోఒకటి హడవుడిగా వ్రాయటం ఎందుకూ? శాస్త్రమనం కూడబలుక్కుంటే నయంగదూ?" అన్నది కాంతం. గుంటలు పడ్డ చెక్కిళ్లలో వెలుగులు చక్కిలిగిలి పెట్టుకున్నవి.

"సరే, అయితే ఏం పేరు పెడదాం"

"అదే మిమ్మలను అడగటం"

"నాకేం తోచటం లేదు. ఇదివరలో అంటే పేర్లు సిద్ధంగా ఉండేవి. మొదటిపిల్లకు మా అమ్మపేరూ, రెండోదానికి మీ అమ్మపేరూ, మూడోబిడ్డకు మా తాతపేరు పెట్టాము. తరువాత పుట్టినవాడికి నీ ఇష్టదైవంయొక్క పేరు పెట్టుకున్నావు. ఇక దీనికి పేరు కుదరటం కష్టమే" అన్నాను నేను.

"ఈదఫా మీకు ఇష్టమైనపేరు పెట్టుకోండి" అన్నది కాంతం నావంకనైన చూడదు. పుట్టుగుడ్డు తెలి మొగములో పుణ్యాలోకాలు వెదుకుతుందా!

"పూర్తిగా నా యిష్టమేనా? అంతదయా!"

"బాగుందంండోయి! మీకూతురకు మీకిష్టమైన పేరు పెట్టుకుంటానికి ఒకరి ఆజ్ఞ ఏమిటి!"

"నాకూతురైతే, నీకూ కూతురేగా?"

"అయితేనేం మీకిష్టమైనపేరు చెప్పండి."

"సరే అయితే, జానకి పెడదాం."

"జానకా?"

"అవును."

"బాగానే ఉందికాని...... ....."

"ఆ కానీ ఏమిటిచెప్పు? ఏదో ఉంది."

"అది కాదండీ, ఏదైనా పేరు పెడితే ముద్దుగా ఉండాలె, మంచి సంగతులు జ్ఞాపకానికి రావాలె"

"ఇప్పుడుమటుకేం జానకి జగత్‌మాత మహాసాధ్వి, అంతకంటె మంచి పేరేముంటుంది."

"మంచిపేరేకాని, సీత కష్టాలు జ్ఞాపకానికి వస్తవి. అదీగాక నీక్కాడక మునుపు, మీరు నాకు ఉత్తరరామాయణం నాటకం చదివి వినిపించారు. జ్ఞాపకం ఉందా? సీత కష్టాలు చూచి ఏడ్చాను. అప్పటినుంచి ఆపేరు తల్చుకుంటె భయం వేస్తుందండీ?"

"సరే పోనీ మానేద్దాం. ఇంకేదైనా పేరు పెడదాం"

"సుగుణ అని పెడదాం?"

"సుగుణా? ఆ సుగుణ, ఎందుకులే? సుగుణ, వివేకం, అవన్నీ కిరస్తానిపేర్లు"

"ఓహో ఆమాట నిజమే. అదీగాక నీ[illegible]గా, పెంకెతనం, మొండితనం, ల[illegible] చేసి [illegible] మొదలుగా గల సుగుణాలు గలదైతే నేతిబీరకాయవంటి సార్థమైన పేరు అవుతుంది. మరేమంటావు?"

"శేషగిరి అని పెడితే? ఆపేరు మానాన్నకెంతో ఇష్టం!"

"మీనాన్నకు ఇష్టమైతే నీకు పెట్టాలిసింది. కొండలపేర్లూ నదులపేర్లూనా, పిల్లలకు పెట్టుకోటం! మామాస్టరుగారు

ఒకాయన ఉండేవాడులే. ఆయన శేషాచలం, వింధ్యాచలం హిమాచలం అని పేర్లు మొగపిల్లలకూ, గంగ, యమునా, కృష్ణా, గోదావరీ అని ఆడపిల్లలకూ పేర్లుపెట్టాడు. అట్లాచేయ మంటావా? ఉంహు, ఉంహు నాకో పేరు తోచింది. మనకు ఇక పిల్లలు వద్దే. ఇదే ఆఖరు కాన్పు అనుకో. అంచేత కోరుకో ఆ అర్థాన్ని సూచించేటట్లు, ఆసంగతి ఎప్పుడూ జ్ఞాపకానికి వచ్చేటట్లు. సంపూర్ణం అని పేరు పెడదాం. నీవు అడ్డుచెప్పక. అంతే అదే నిశ్చయం"

"అయితే బావా, ఒకవేళ ఇంకో పిల్లపుడితే ఏంజేస్తావు" అన్నాడు మా బావమరిది.

"పుట్టకూడదని నిశ్చయించుకొన్నాగా?"

"అయ్యో, మన నిశ్చయాలు, మనం... ........... అన్నది" కాంతం, ఎత్తిపొడుస్తూ.

"పుడితే ఎట్లా చెపుదూ" అన్నాడు మా బావమరది.

"అంతగా పుడితే మంగళహారతి అని పెడతాం మంగళ హారతితో ప్రతి పనీ పూర్తి జేస్తారు. భజనలూ పురాణకాల క్షేపాలూ, పూర్తిఅయిన తరువాత మంగళహారతి ఇస్తారు"

"ముందు సంపూర్ణం అయిన తరువాతగా మంగళహారతి" కాబట్టి దీనికి సంపూర్ణం అని పేరు పెడదాం. అమ్మ! ఏదో ఒకటి తేలింది" అన్నాను నేను.

"బాగానే ఉంది?"

"ముక్కువిరిస్తేగాదు. ఆపేరు పెడితేనేం?"

"చాల్లెండి. పాండిత్యము. మా అంగారు తల్లికి మంచి పేరు పెట్టారూ?" అని పిల్లను తీసి మృదుహస్తాలతో నిమిరింది కాంతం"

"సరే పోనీలేవే నీకింతకష్ట మెందుకు. ఊర్వశి అని పెడదాం పోనీ, ఊర్వశి చక్కనిదని ప్రసిద్ధం"

"చాల్లెండి వేళాకోళం. రంభ, ఊర్వశీ, తిలోత్తమా ఇవా మనం పెట్టుకొనే పేర్లు? అయినా ఆ భోగంముండల పేరేమిటికి?"

"మరి ఎట్లాగే. ఒకాయన ఇట్లాగే పేరు దొరికిన పేరు పెటన్ అని నామకరణం చేశాడట. ఇక నాకు తోచటంలేదు. నీయిష్టం"

"నాఇష్ట మెందుకు? మీచిత్తమొచ్చిన పేరు పెట్టుకోండి. నే నొద్దంటే అప్పుడనండి. ఏదో ఆడదాన్ని కాబట్టి చెప్పాలని అది చెపుతున్నా. శుక్రవారం పుట్టింది, కాబట్టి లక్ష్మి అని పేరు పెట్టుకుంటే ముచ్చటగా ఉంటుంది.

"లక్ష్మి? లక్ష్మి - బాగుంది. "లక్ష్మి, నీనామ మెంత లలిత మహాహా" అని ఒకకవి వ్రాశాడు. బాగుంది. సరే ఇంకేం! అదే పేరు" అన్నాను.

"బావా! ఏమైనా కొత్తపేరు పెట్టరాదూ? ఉత్తర హిందూస్థానంలో వాళ్ళ పేర్లు చూడూ, ఎంతచక్కగా ఉంటవో! కమలాబాయి నెహ్రూ, ఇందుబాల, జటాజూట శిరోమణి, శిరీష కుసుమకోమలి, ఇట్లాంటి పేరుపెడితే, ముందు పేరు వినటానికి ఎంత Poetic గాను శ్రావ్యంగాను ఉంటుంది! పేరు

మనోహరంగా వుండాలి. ఒక పేరు ఒక భావగర్భితమైన ఖండ కావ్యంగా ఉంటుంది. 'The name itself is a beautiful poem' అన్నాడు మా బావమరది.

"నాకూ మంచి పేరంటే సరదా. వాడు చెప్పిన పేర్లలో జాటాజూట శిరోమణి అంటే చంద్రునికి చెందుతుంది. చంద్రుడు చల్లనివాడు. బాగుండి ఆపేరు. చదువుకోనివాళ్ళు చంద్రమ్మ అని పెట్టుకొంటారు. జట్టాజూట శిరోమణి అని పేరు పెడితే ఒక పండిత కుటుంబములోనిదని ముందే తెలుస్తుంది. రెండోది చంద్రుడు కావ్యానికి వస్తువ. వెన్నెలనూ చంద్రుడ్నీ కవులు ఊరూ, మెచ్చుకొంటారు కాబట్టి ఆపేరు పెడదాం" అన్నాను కాంతంతో సరదాపడుతూ.

"ఆ పేరు పెడితే అందరూ తిట్టరూ?"

"ఏమి?"

"చంద్రదూషణ అన్ని కావ్యాలలో ఉండదూ?"

"ఆ!, దానికేం, అది వ్యంగార్థంలోగా"

"అదీగాక అమ్మాయి పెద్దదైన తరువాత దాన్ని అంత పెద్ద పేరుతో ఎవరు పిలుస్తారు, అయినా మనపేర్లుకావు అవి. ఎవరో బెంగాలివాళ్ళు పెట్టుకునే పేర్లు మనకెందుకు, మనకు తగినపేరు మనం పెట్టుకొందాం" అన్నది కాంతం.

"సరే, పోనీ లక్ష్మి అని పెడదాం" అన్నాను.

లక్ష్మి నిశ్చయమైపోయింది. మర్నాడు ఇల్లంతా అలంకరించారు. నలుగురు బంధువులూ వచ్చారు. ఇల్లుకళకళలాడు

తున్నది. సీటలమీద కూర్చున్నాం పేరు వ్రాయటానికి. పళ్ళెంలో ముత్యాలలాంటిసన్నబియ్యంపోసి నాముందుపెట్టారు. కళ్ళుమూసుకొని నిద్రపోతున్న బిడ్డకేసి గర్వంగాను సంతోషంగాను చూస్తున్నది కాంతం.

"సరే ఏంపేరు వ్రాయమంటావు ?" అన్నాను.

"సుబ్బలక్ష్మి!" అన్నది కాంతం.

ఈ 'సుబ్బేమిటి' అన్నాను.

"మానాయనమ్మ వచ్చి తనపేరుకూడా కలపమని వాదింగింది పాపం. ముసలమ్మగారి మాట తీసివేయటం ఎందుకు ? ఆమె మనస్సు సంతోషిస్తేనే మనకుక్షేమం" అన్నదికాంతం.

"వ్రాయమంటావా ?"

'మీఇష్టం"

'ఇంకా నాయిష్టమేమిటి ? వ్రాస్తున్నానని బంగారపు ఉంగరం తీసుకొన్నాను. ఇంతలో మానాన్నవచ్చి అబ్బాయీ, మనకు వెంకటేశ్వర్లు ఇంటి ఇలవేల్పు. ప్రతిపేరు ముందరా "వెంకట" చేరుస్తున్నాము. నీపేరు అందుకనే వెంకట్రావు అని పెట్టాము. కాబట్టి వెంకటసుబ్బలక్ష్మి అని వ్రాయమన్నాడు. కాంతం నావంక ఓరకంటితో చూచి నవ్వుకొని మామిడి చిగుళ్ళలాగున్న పిల్లగానిచేతులు చెక్కిళ్ళకేసి అదముకొంటున్నది.

"సరే, వ్రాసేదీ కాంతం ?"

"నాదేముంది మీఇష్టం"

"అంతా నాయిష్టమే?" అని ఇంకా ఆలస్యంచేస్తే పేరుకు ఆద్యంతాలలో ఏంచేస్తుందో అని వెంటనే వ్రాసేసాను. మా చిట్టి తల్లికి నామకరణం అయింది. వెంకటసుబ్బలక్ష్మి అని పేరు వ్రాస్తేనేం? లక్ష్మి అని పిలుచుకొంటాను. లక్ష్మిఅన్న పేరు బాగానే ఉంది అనుకొన్నాను.

పిల్లకు ఎనిమిదో నెలలో మా బావమరిది చూడటానికి వచ్చి, అవీ ఇవీ మాట్లాడుతూ "వెంకటసుబ్బలక్ష్మి ఏమంటున్నది?" అన్నాడు.

"ఎవరు?" అన్నది కాంతం ఆపేరు ఎప్పుడూవిననట్లు.

"ఎవరేమిటి? మొన్న పుట్టినదాని పేరు సుబ్బలక్ష్మి కాదుటే?" అన్నాడు మా బావమరిది వాళ్ల అక్కయ్యతో.

ఆదా! మా "పద్మ" సంగతా? అదుగో "పద్మతల్లి తప్పటడుగులు వేస్తున్నది" అన్నదికాంతం.

"పద్మావతి అని మార్చామురా చిట్టితల్లిపేరు "పద్మావతి" బాగుందా?"

"బాగుండ కేం! బాగుంది బావేడి?"

"వసారాగదిలో వ్రాసుకొంటున్నారు." అన్నదికాంతం. మా బావమరిది నాగదిలోకి వచ్చాడు నవ్వుతూ. నేనూ సంతోషించి, ఏవో అవీ ఇవీ మాట్లాడుకొన్న తరువాత "బావా, పద్మావతి చేతులకు బంగారపు వస్తువులు తెచ్చాను ఇవిగో" అన్నాడు.

"పద్మావతి ఎవరు?" అన్నాను నేను.

మా బావమరది తెల్లపోయి "కలలో ఉన్నానా, లేకపోతే మీ అందరికి పిచ్చిఎత్తిందా?" అన్నాడు.

"ఏమిటి" అన్నాను నేను.

"మొన్న పుట్టిన దానికి పేరుమార్చి పద్మావతి అని పెట్టారని అక్కయ్య చెప్పిందే, నీవు పద్మావతి ఏవరు అంటావేం" అన్నాడు.

"ఓహో మా 'సరోజని' సంగతా, దాన్ని నేను సరోజని అని పిలుస్తానులే" అన్నాను.

"మాఅక్కయ్యో?"

"ఆవిడ ఇష్టం ఆవిడిది. ఆవిషయంలో మేము ఇద్దరం పోట్లాడుకొన్నాము."

"అల్లాగా, అయితే పోనిలే. నీవు పెద్దవాడివి నీఇష్టం ప్రకారం సరోజని అని పిలుద్దాము. ఈభాగ్యానికి పోట్లాటలు ఎందుకూ అన్నాడు. నేనూ సంతోషించాను మాపోట్లాటను మా బావమరిది సద్దేసినందులకు. కానేప్పుండి నేను లోపలికి పోయినాను. పసిబిడ్డ చేతులకు బంగారపు వత్తులు తొడిగినారు. పాలమిసమిసలతో మెరుస్తున్న ఆముద్దొచ్చే చేతులకు ఆపచ్చని బంగారపు వత్తులెంతో అందంగా ఉన్నవి.

"మాతల్లి — మా పద్మకు, ఈవత్తులు ఎంత అందంగా ఉన్నవిరా, నాన్నా" అంటూ కాంతం పిల్లను ఎత్తుకొని ఆడిస్తున్నది.

పద్మావతి, పద్మతల్లీ అని అంటూ పిల్లను తన చేతులలోకి

తీసికొని గులాబి రేకులవంటి దాని బుగ్గలు ఎరు పెక్కేటట్లు ముద్దాడుతున్నాడు మా బావమరిది. నేను తెల్లపోయినాను. అక్కాతమ్ముడూ మహా సంతోషంతో ఉన్నారు. వాళ్ల కళ్లల్లో ఆనందం పొంగి పొరలి పోతూ ఉన్నది, నన్ను జూచిన వాళ్లే లేరు.

నేను బయటికి వచ్చాను. అప్పుడే అస్తమయం అవుతున్నది. రంగు రంగుల చీరలు కట్టుకొన్న వాళ్లెవరో పశ్చిమ దిక్సతి ఒళ్లో ఉన్న సూర్యుని ముద్దాడుతున్నారు. ఆదిక్కు మహా ఆనందంలో పొంగిపోతున్నది. ఇటు ప్రక్కను ఉన్న శుద్ధాష్టమి చంద్రుడు తెల్లపోయి ఆ ఆనందాన్ని చూస్తూ, నిలబడి ఉన్నాడు.

## దొ ర బా బు

మా కాంతానికి సంతానం అయిదుగురు. మహాలక్ష్మి సమానులు ముగ్గురు; రాజమాన్య రాజపూజితులు ఇద్దరు. ఈ ఇద్దరిలో శ్రీరఘురామ యాజ్ఞవల్క్య జ్యేష్ఠుడు. యాజ్ఞవల్క్య మహాఋషిలాగ మేధావి కావాలని ఉద్దేశించే మా కాంతం వాడికా పేరు పెట్టింది.

అనేకసార్లు నాతో అన్నది మా అవిడ. "వీడు అఖండమైన తెలివి తేటలు గలవాడు అవుతాడండీ" అని.

వాడి ముఖం చామనచాయలో కళకళలాడుతూ ఉంటుంది. వాడిది గంభీరమైన చూపు. ఠీవిఅయిన నడక కూడానూ.

తల్లి, కాంతం వాడిని దగ్గరకు తీసుకొని ముద్దాడి, మా తండ్రి పెద్దవాడైన తరువాత గొప్ప ఉద్యోగం చేస్తాడు. దేవుడు వాడికి ఆయురారోగ్యాలు అనుగ్రహించాలె గాని, మా బాబు డిప్యూటీకలెక్టరు ఉద్యోగం చెయ్యడూ?" అనేది.

"అంతకంటే పెద్ద ఉద్యోగం ఏమీ నీకు తోచింది కాదా?" అన్నాను నేను.

"అది కాకపోతే పోలీస్ సూపరెంటు. కాడంటారా? వాడు జనరల్ మానేజర్ ఆఫ్ ది మద్రాస్ అండ్ సదరన్ మహారాట్టా రైల్వే అవుతాడు, ఏమంటారు?" అన్నది కాంతం.

"ఓ. తప్పకుండా" అన్నాను నేను.

కాంతం మళ్లీ వాడిని దగ్గరకు తీసికొని, ఇంకోసారి ముద్దాడి "ఏమండీ, మా బాబుకు ఏంతక్కువ? దొరబాబండీ" అంటుంది.

ఇల్లాంటి సమయంలో ఆ చిన్న వెధవ రఘు ఛాతీవిరిచి, నిశారున నిల్చుని కాస్త నవ్వుకొంటాడు. ఇల్లాగ అనేకసార్లు జరుగుతూ వచ్చింది.

మేము ఇల్లాగ చాలాసార్లు అనటంమూలాన వాడూ గట్టిగా నిశ్చయించుకున్నాడు. ఎప్పుడో ఒకప్పుడు తప్పీమని గొప్పవాడు కావాలని. ఎవ్వరూ చెప్పకుండానే వాడికికొన్ని గొప్పగుణాలు అబ్బినై. ఎవరైనా బిచ్చగాడు కంటిముందుకొచ్చి, దీనంగా అడిగాడో ............ వాడిదగ్గర కానీ ఉండనీయండి? అర్ధణా ఉండనీయండీ, ఎంతఉంటే అంతా తప్పీమని ఇచ్చేసే

వాడు. ఇచ్చేసిన తరువాత కూడా తనకు లేకపోయిందే అని విచారించేవాడు కాదు! బ్రాహ్మడికి యాయవారం పెట్టినా దోసిళ్ళతో పెట్టడు. వెండి కప్పుతోగాని బియ్యం తీసుకెళ్ళే వాడు కాదు.

“అబ్బో! రఘూకు దర్జా ఎక్కువైందే అమ్మా, వెండి గిన్నెతోగాని పాలు తాగట్టే” అని పెద్దపిల్ల తల్లితో అంటే ఆవిడగారు “అంతే అమ్మా, వాడంతే” అనేదేగాని, వాడ్ని “అదేమిరా” అనేదికాదు.

ఈసామాన్యకుటుంబములో పుట్టికూడా వాడు పిల్లజమీందారులాగే జరుపుకొంటున్నాడు. ఇంతవరకూ వాడికి అవ్వల్ దర్జాగానే జరుగుతూ ఉన్నది.

ఆరోజు నేను స్నానం చేస్తున్నప్పుడే చిన్నవాడొచ్చి చెప్పాడు సూర్యం మామయ్య వచ్చాడని. నేను స్నానం త్వరగా పూర్తి చేసుకొని మేడపైకి వెళ్ళేసరికి సూర్యనారాయణ కుర్చీలో కూర్చుని కాంతంతో మాట్లాడుతున్నాడు. ఆవిడ గదిగుమ్మంలో తలుపు కానుకొని నుంచున్నది. ఆయన కుర్చీలో కూర్చుని సిగరెట్టు తాగుతున్నాడు.

మేమిద్దరం ఓహో అంటే ఓహోఅనుకొన్న తరువాత, సూర్యనారాయణ అన్నాడు – “ఏమోయ్, వీడేకదూ మీ పెద్దఅబ్బాయీ” అని. “అవును, వీడే” నన్నాను. “ఇట్రా నాయనా!” అని పిల్చాడు వాడ్ని. మాఅబ్బాయి ఆయనకు దగ్గరగా వెళ్ళినుంచున్నాడు ఠీవిగా. మర్యాదగా బ్లూమర్ ను

ఓడించిన 'నే' సేనాని నెపోలియన్ ముందు నించున్నట్లు. ఆయన వాడ్ని తన ప్రక్క కుర్చీలో కూర్చోబెట్టుకొని నాతో ఏదో విషయం చెప్పటానికి "పిఠూ..." అనిఆరంభించాడు. ఇంతలో కాలుస్తూఉన్న సిగరెట్టు అయిపోవటం మూలాన కిటికీలోనుంచి బైటకుపారేసి పాకెట్‌లో నుంచి కొత్తసిగరెట్టు తీసి దాని మొనను నిప్పుపెట్టె మీద ఒక పద్ధతిలో, ఒక రిధిమ్‌లో ముమ్మారు కొట్టాడు. అల్లా కొటుతూన్నపుడు ఆయన నావంకా చూడలేదు. మాఆవిడవంకా చూడలేదు. కిటికీలోంచి దూరాన ఉన్న దేన్నో చూస్తున్నట్టుంది. ఆకిటికీ అవతల బాదంచెట్టు ఒకటుంది. దానికి వెనకాల తాటిచెట్లు గాలికి తల ఊపుతున్నాయి. మరి ఆయన ఏంచూస్తున్నాడో నాకు తెలియలేదు. ఏదో చెప్పబోయి ఆగటంచేత నేనూ ఆతురతతో అతనివైపు చూస్తూ కూర్చున్నాను.

ఆవిధంగా ఆయన సిగరెట్టుతో నిప్పుపెట్టెమీద ముమ్మారు కొట్టి...సిగరెట్టు వెలిగించి...ఏదో గొప్ప రహస్యం నాకు ఆదరణతో చెపుతున్న వాడిలాగ చూస్తూ ప్రతిమాటా నొక్కుతూ "వీడు చాలా గొప్పవాడు అవుతాడు" అన్నాడు ప్రసన్నవదనంతోనూ, గంభీరమైన గొంతుతోనూ.

ఆమాటలు విన్న కాంతం ముఖం సంతోషంతో తొణికిసలాడింది. కాని ఆవిడ ఏమీ మాట్లాడకుండా శ్రద్ధతో ఆయన మాటలు వింటానికి కుతూహాలం కనపరిచింది.

"అప్పుడప్పుడు వాళ్ళ అమ్మకికూడా అదే అభిప్రాయం. సంతోషం పెద్దయినతరువాత వాడు ఎల్లాగ తయారు అవుతాడో మరి" అన్నాను.

"హాఁ హాఁ హాఁ హా, నీకింకా అర్థంకాలేదు. నేను తమాషాకు అన్నమాట కాదు. అనుభవం మీద చెబుతున్నాను. వాడి మాటల్లో ఉంది, భాగ్యంఅంతా. అది అల్లా ఉంచు. అసలు ఈ మర్యాద ఎక్కడ నేర్చాడోయి" అన్నాడు. అని, నన్ను అడిగితే లాభం లేదనుకొని ఆవిడగారివంక తిరిగి చూశాడు.

"వాడి మొఖం లెండి! ఏమన్నా డేమిటి?" అన్నది కాంతం.

మళ్ళీ మా సూర్యనారాయణ అందుకున్నాడు. "ఇంటి ముందు కారు ఆపి, 'నాన్నగారు ఉన్నారా' అన్నాను. వీడు ముంగుకొచ్చి 'ఉన్నారండీ, స్నానం చేస్తున్నారు. దయ చేయండి' అన్నాడు."

"వాడంతేనండీ అన్నయ్యా. వాడికి కాస్తమాట, మర్యాద తెలుసు" అన్నది కాంతం.

"అసలు పదేండ్ల కుర్రవాడికి అంతమర్యాద తెలియటమే గొప్పవిషయ మనుకో! దాని తరువాత ఆ అన్న పద్ధతీ! ఎంత తమాషాగా అన్నాడోయ్! వినయానికి వినయం! మర్యాదకు మర్యాద!" అని ఆ స్నేహితుడు మెచ్చుకున్నాడు మా అబ్బాయిని.

"ఇదీ ఒక గొప్పేనా ఏమిటండీ!" అన్నది కాంతం చప్ప

రిస్తా. పైకి ఇల్లాగ అన్నా లోపల ఆమె ఎంతో సంతోషిస్తున్నది.

"అదిగాదు అమ్మాయ్. అసలుసంగతి వినాలి నీవు. లోపలికి వచ్చానా, పైకి తీసుకొచ్చాడు. కుర్చీలో కూర్చోమన్నాడు. కూర్చున్నా. 'నాన్న ఏంజేస్తున్నా' డంటే, 'స్నానం చేస్తున్నారు. పదినిమిషాలలో వస్తారు' అన్నాడు. మీఅమ్మఏంజేస్తూందిరా' అంటే 'మీరు వచ్చారని చెప్పాను, వస్తున్నద' అన్నాడు. సరేనని కూర్చుని. ఒక సిగరెట్టు తగలేద్దామని చేబులోనుంచి పాకెట్ తీశాను. చూస్తే అందులో సిగరెట్లు లేవు ఎట్లాగా అని ఆలోచిస్తూ న్నాను. వీడు చప్పున మేడమెట్లదగ్గరకు వెళ్ళి 'అప్పి' అని కేకేశాడు. అది మీ పనిజేసే పిల్లకదూ?"

"అవును" అని నేను తల ఊపాను.

'చూశావా, వాడి తెలివి? నాకు సిగరెట్లు కావాలన్న సంగతి గ్రహించాడు! ఏమిటంటావు? అది తెలివంటావా, కాదంటావా?"

కాంతం నవ్వింది! నేనూ ఆమెముఖం చూస్తూ "తెలివే మరి. తెలివికాదూ" అన్నాను.

"అప్పుడే కాలేదు కథ! నేనూ సంగతి గ్రహించి 'ఇదిగో వోయ్ డబ్బు, ఒక్క సిజరుపాకెట్టు తెప్పించు' అన్నాను. వీడు చిరునవ్వుతో, 'అక్కరలేదండీ' అంటూ ఆఅప్పితో ఏమో రహస్యంగా, నాకు వినిపించకుండా మాట్లాడాడు. అయిదు

నిమిషాలైందో లేదో అప్పి పాకెట్లూ, నిప్పెట్టె నాబల్లమీద పెట్టింది. చూశావా...ఆమర్యాదకు చెబుతా!" అన్నాడు.

"ఏమిటోయ్, అంతగొప్పగా చెబుతావు? ఆమాత్రం మర్యాద తెలియటంకూడా ఒక గొప్పే అంటావూ?"

"అదేమిటి అల్లా అంటావు? నేను ఇన్సూర్యెన్సు పనిమీదరకరకాల మనుష్యుల ఇంటికి వెడుతుంటాను. సాధారణంగా బాగా భాగ్యవంతుల కొంపలకే వెడుతుంటాను. కాని ఇంత చిన్నవయస్సులో ఇంత మర్యాదగా ప్రవర్తించటం నేను చాలా అరుదుగా చూశాను" అన్నాడు.

ఈయన మా ఆవిడకు సయాం అన్నయ్య కాదు. నాకు బాల్యస్నేహితుడు. ఆరీత్యా ఆవిడకు అన్నయ్య అయినాడు. అయితేనేం, స్వంత అన్నకంటే ఎక్కువ ఆపేక్షగా ఈయన ఉంటాడు. స్వంత చెల్లెలుకంటె ఎక్కువ చనువుగా ఆవిడగారూ ఉంటుంది.

అదీ అసలుసంగతి. ఎప్పుడైనా ఈప్రాంతాలకు పనిమీద వచ్చినప్పుడు మాఇంటికి వచ్చిచూచి పోతుంటాడు.

౨

మామూలు వేళకు భోజనాలైనై. నేను కాసేపు నిద్రపోయి, లేచి, క్రిందికి వచ్చాను. ఆయన ఇంకా నిద్రపోతూనే ఉన్నాడు. మా ఆవిడ మధ్యాహ్నం ఫలహారానికి కామాలు గారెలు చేస్తున్నది.

"అయితే, కాంతం, గారెలు చేస్తున్నావా, ఫలహారానికి? మరి... కాఫీకూడా చేస్తావా?"

"మరి ఎండ మండిపోతూంటే కాఫీ ఏమిటండీ?" అన్నది.

"మరి ఏమంటావూ?" అన్నాను నేను.

"ఏమీ వద్దు, కమ్మని గారె తిని కాసిని మంచినీళ్ళు తాగుతారు లెండి" అన్నది. ఆవిడ.

"ఆ, కాస్త ఏదైనా షర్బతు లాంటిదైనా ఇస్తే బాగుంటుంది కాని బొత్తుగా మంచినీళ్ళు ఇస్తే ఏం బాగుంటుంది? అదీ నే ననటం" అన్నాను నేను.

"మరేం ఫరవాలేదు. ఇప్పుడెల్లాగ వస్తుందీ షర్బతూ గిర్బతూను? బావిలోనుంచి తోడి చల్లటి నీళ్ళు ఇస్తాను చాల్లెద్దురూ!" అన్నది ఆవిడ.

"మన బావినీళ్ళు కాస్త ఉప్పనగదా కర్మం!"

"మరి ఏమంటారూ?"

"మంచినీళ్ళలో రెండు నిమ్మకాయలు పిండి కాస్త పంచదార వేసిఇస్తే షర్బతులాగ ఉంటుంది, అవునా?"

"దానికైనా నిమ్మకాయలు కావాలిగా?"

"ఇంట్లో లేవూ?"

"ఊహూం!"

"అయితే, నేను బజారునకు వెళ్ళి తీసుకొస్తాను" అన్నాను.

"మీరు నన్ను క్షమించాలె. ఈ ఎండలో మీరు బజారుకు వెళ్ళటానికి నే నొప్పుకోను, మీవయస్సువాళ్ళు ఇంత

ఎండలో తిరగకూడదమ. అంతగా అయితే రఘూను పంపండి?" అన్నది ఆవిడ.

"వాడు బజారుకెళ్ళి..................."

"మీ కొసం దేహం అక్కరలేదు, పంపండి......బాబూ ఒరే రఘూ" అని పిల్చింది కాంతం. పెద్దబాబు దొరలాగవచ్చి అమ్మకెదురుగా నుంచున్నాడు. అమ్మ కొడుకును చూచి ఆనందిస్తున్నది.

"నాయనా, బజారుకు వెళ్ళిరావాలిరా!" అన్నాను నేను. "అల్లాగే" అన్నాడు దొరబాబు.

"చూశారా, నాతండ్రి ఎంత బుద్ధిమంతుడో! పోననిగాని ఎండ అనిగాని అన్నాడేమో చూశారా? విధేయత — మర్యాద తెలుసండీ బాబుకూ" అన్నది మాఆవిడ.

"ఏం తేవాల నాన్నా!" అన్నాడు బాబు.

ఆసమయంలో వీధిలోకి వెళ్ళి ఏదైనా తేవటం అనే ఒక సాహసకార్యాన్ని వాడుసాధించాలని కుతూహలపడుతున్నాడే కాని ఎండలో పోవడం కష్టం అని వాడు అనుకోటంలేదు. పితృవాక్య పరిపాలనార్థం ఎంత సాహసకృత్యమైనా చేయటానికి సిద్ధపడ్డవాడిలాగా, సిపాయిలాగా, నుంచున్నాడు.

అప్పుడు నేనన్నాను — "నాయనా, ఇదిగో రూపాయి. బజారు కెళ్ళి, నాలుగు నిమ్మకాయలూ, ఒక పౌను మంచు గడ్డా తీసుకొని రావాలె."

సరేనని వాడు బయలుదేరాడు. "రూపాయి ఎక్కడైనా

పారేస్తా వేమోరోయ్ !" అన్నాను నేను. వాళ్లమ్మకూడా "జాగ్రత్తరా నాయనా" అన్నది. వాడేం మాట్లాడలేదు. కాని ఒక చిరునవ్వుమాత్రం నవ్వాడు. ఆచిరునవ్వులో ఉన్న అర్థవిశేషాన్ని గురించి ముగ్గురుపండితులు నోట్సు వ్రాయాలసినంతవిషయముంది.

"ఒక్కరూపాయి జాగ్రత్తగా వాడలేనవేనా నీ అభిప్రాయం? పిచ్చిదానా ... ఒక్కరూపాయి ఏమిటి, వందరూపాయిలు ఇచ్చినా అంచక్కా జాగ్రత్తగా వాడగలను, తెలుసునా" అన్నట్లు అర్థమైంది మాకిద్దరికీ.

"సరే నాన్నా, వెళ్ళు. చెప్పులు తొడుక్కుని గొడుగు వేసికొని వెళ్ళేం" అన్నది కాంతం.

వాడు వెళ్ళుతుంటే నిలబడి చూచి, కాంతం "ఎట్లానడుస్తాడో చూశారా" అన్నది.

"ఏం మామూలుగానే ఉంది" అన్నాను.

"మామూలుగా ఉంది, వంకర కాళ్లతో... వంగితూలుతూ నడిచే నాళ్లకు...నడకలో ఉండే దర్జాతనం ఏం తెలుస్తుంది? బెంగాలులో ఫోటోలు చూశారూ, జమీందారులు, శరత్ బాబు, హేమచంద్రుడు... అదిగో అల్లాంటివాళ్ళ నడక అబ్బాయిది."

"సరే, సరే, రైట్ — ఒప్పుకొన్నాను. అది సరే కాని మరి పుత్రరత్నం ఇయ్యటానికి గ్లాసులు ఏవీ?"

"పింగాణీగ్లాసు లున్నయి కదండి."

"ఎబ్బే, పింగాణీగ్లాసులలో ఇవ్వటం ఏంకర్మం, మనకు వెండిగ్లాసు లుండగా ?"

"ఆ వెండిసామానులు ఎక్కడో ఉన్నాయి పైన. ఇప్పుడు ఎవరు తెస్తారు పోనిద్దురూ !"

"నామాట వినదూ, నేను తెస్తాను పైకెళ్ళి!"

"మన భాగ్యం అంతా నైటపెట్టాలకామాలు ?"

"ఏదో పోనిద్దూ అన్నానుగా."

"సరే, అల్లాగే కానీండి" అన్నది కాంతం.

"అబ్బాయి ఇంకా రాలేదేమబ్బా ? చాలాసేపు అయిందే వెళ్లి ! వాడికి రూపాయికూడా ఇచ్చాను! ఏం జేసుకొస్తాడో" అన్నాను నేను.

"వాడి కేమీ తెలియదనా మీ ఉద్దేశం ? మీకంటే బాగానే బేరంచేయగలడు. మీకు అసలు బేరంచేయటం ఏమీ తెలియదు. ఒకటి తెమ్మంటే ఒకటి తెస్తారు. తెమ్మన్న వస్తువులలో సగం మర్చిపోతారు. మీసంగతే చెప్పాలె ! అయ్యో! అయ్యో! ఎందుకొచ్చిన అవస్థ! ఇక మీరు ఊరు కోండి. బజారువస్తువులన్నీ వాడిచేత తెప్పించుకొంటాను !"

"తెప్పించుకొందువుగాని, ఇంకా రెండేళ్ళుపోనీ" అన్నాను.

"అయితే మన అబ్బాయి తేలేడనే మీఉద్దేశం ? చాలా పొరపడుతున్నారు. బేరం చేయటం తెలుసు వాడికి ! కొసరు అడగటం తెలుసు. అన్నీ తెలుసునండీ. మీకంటే వెయ్యి రెట్లు నయం. మొన్న వంకాయలు తెచ్చాడు. ఎల్లాంటివి

తెచ్చాడు' లేత మొవ్వలు నవనవలాడుతూ ఉన్నాయి."

"పుచ్చు వంకాయలు తెచ్చాడని నీవు విసుక్కున్నావు గదూ."

"లేతవి తెమ్మంటె లేతవి తెచ్చాడండి. పుచ్చుసంగతి వాడి కప్పుడు తెలిసింది కాదు. ఒక్కొక్క విషయమే చెపితే తెలుస్తుంది. ఇప్పుడు బజారుకు పంపారుగా, చూడండీ, మీరు చెప్పిన రెండువస్తువులూ కొనుక్కొనివస్తాడు దొరబాబులాగ.

"దీని కేం భాగ్యంలే.

"అబ్బా, అంతేనా? పచ్చిమెరపకాయలు తెమ్మని మిమ్మల్ని బజారుకు పంపిస్తే మీరు ఆరోజున ఏం జేసు కొచ్చారు జ్ఞాపకంలేదూ?"

"ఏం జేసుకొచ్చానేమిటీ?"

"ఏం జేసుకొచ్చారా? కాఫీ హోటల్లో కాసేపు గడిపి, ఆతరువాత కూరలబజారు కెళ్ళివంకాయలూ, వెలక్కాయలూ తెచ్చారు. పచ్చిమెరపకాయల సంగతే మర్చిపోయినారు!"

ఎందుకు అల్లాగ నవ్వుతావు! మర్చిపోతే మర్చిపోయి ఉండవచ్చు వంకాయలు మట్టుకు పనికొచ్చే వస్తువులు కాదా?"

"అయితే, అప్పటికే ఇంట్లో రెండువీసెల వంకాయ లున్నాయి. ఆసంగతి మరిచిపోయి మళ్ళీ వంకాయలు తెస్తే ఏం జేసుకోవాలె! నెత్తినేసి కొట్టుకోవాలా? అల్లాంటివి మీపనులు! మాబాబును వదిలేస్తే ఇల్లాగే తయారవుతా డేమో! ఇప్పటినుంచీ నేర్చుకొంటాడు" అని అన్నది కాంతం.

"అల్లాగే చేయ్...సరేగానీ, అబ్బాయి ఇంకా రాలేదే మరి!"

"రావాలా మరి ఎండలో?"

"సరే. నువ్వు ఇంతలో స్నానంచేసి మంచిబట్ట కట్టుకో."

"ఏచీర కట్టుకోమంటారూహూ!"

"పట్టుచీర."

"ఎందుకండీ పట్టుచీర ఇప్పుడూ?"

"ఎందుకో నాకు తెలియదు. అడిగావు కాబట్టి చెప్పాను." అన్నాను. ఇద్దరం ఊరికేనే నవ్వుకొన్నాం.

నేను మేడపైకి వెళ్ళాను. నేనూ, ఆయనా క్రిందకి వచ్చేసరికి మా ఆవిడ వెండిపళ్ళాల్లో మాకూ, పిల్లలకూ అందరికీ వడ్డించింది. రఘుగాడి పళ్లెం ఇంకా ఖాళీగానే ఉంది. ఇంకారాలేదేమా అని ఆదుర్దా గలిగింది.

"ఫలహారం కానిస్తుంటె వాడే వస్తాడు ఆమట్టా" అని కూర్చున్నాం. ఆతరువాత పదినిమిషాలకు వాకిట్లో బండేదో ఆగింది. పిల్లలు పరుగెత్తికెళ్ళి రఘు వచ్చాడని కేకేశారు. పోనీలే సమయానికొచ్చాడని సంతోషించాము.

ఇంతలో రఘూ మాఎదట నుంచున్నాడు. " అదేమిట్రా నాయనా అట్లా ఉన్నావూ?" అన్నది వాళ్ళమ్మ. వాడి తలంతా తడసి ఉంది. బట్టలన్నీ తడసి ఉన్నాయి. వంటినిండా రంపప్పుపొట్టు కొట్టుకొంది.

"ఏమిట్రా నాయనా, ఇదంతా ఏమిట్రా" అంటూ

వాళ్లమ్మ పమిటచెంగుతో తల తుడుస్తున్నది.

"వేసవి మంచుగడ్డే, కరగటంమూలాన రంపప్పుపొట్టు వంటి నిండా పడ్డది." అంటూ ఆరంభించి గుక్క తిప్పుకుండా చెప్పటం సాగించాడు.

"మొదట నిమ్మకాయలే కొన్నానే అమ్మా, సంద పావలా చెప్పాడు. కాని అణాకు పదే ఇస్తానన్నాడు. చిల్లరగా కొంటేనష్టమని యాభై నిమ్మకాయలూ కొన్నాను.

"చూశావురా వాడి తెలివి!" అన్నది వాళ్లమ్మ.

"ఆపళంగా అయిస్ ఫాక్టరీకి వెళ్ళి ఒక పౌను అయిస్ కొన్నాను. 'ఎందులో తీసికెడతావు' అన్నాడు ఆయన. పొట్లం కట్టి ఇయ్యమన్నాను. సరేనని ఆయన ఒక కాయితంలో రంపపుపొట్టుపోసి దానిలో ఈఅయిస్ పెట్టి పొట్లంగట్టి ఇచ్చాడు. ఒకచేత్తో నిమ్మకాయల సంచీ పట్టుకొని నెత్తిన అయిస్ మూట పెట్టుకొని ఇంటికి బయలుదేరాను. కాని ఏమైందనుకొన్నావ్ అమ్మా, కొత్తబూడ్సులు కావటం ఇది—అందుకని కరవటం మొదలుపెట్టినవి. అదీగాక రెండుచేతులలో రెండూ ఉంటే గొడుగు ఎల్లాగ పట్టుకొనేది? అందుకని చెప్పులూ, గొడుగూ అక్కడున్న సోడాషాపులో పెట్టి ఆపళంగా బయలుదేరాను. కూలిపెడదాం అనుకున్నాకాని, ఆవెధవే, 'ఈఎండలో అణా ఇస్తేగాని రానండీ బాబూ' అన్నాడు. అందుకని కూలి పెట్టక నేనే అయిస్ నెత్తిన పెట్టుకొని, నిమ్మకాయలసంచీ చేత్తో పట్టుకొని నడవటం

మొదలు పెట్టాను.

"నాతండ్రే! మానాన్న! చూశారా? కూలీకి అణా ఇయ్యాలని తానే మోసుకొచ్చాడు. మీ మాస్తరు అర్ధణా సొంచికు అణా కూలీ పెట్టడు" అని నన్ను జూచి నవ్వి ఆవిడ కొడుకును ముద్దాడింది.

అడగాదే అప్పాా ఏమూ ప రి. 'కోటవారి తుళ్ళదగ్గరకు వచ్చేసరికి ఏమైందీ! మంచుగడ్డ కరిగి పొట్లం అంతా నావంటి నిండాపడ్డది. అక్కగాక ఆదికరిగి పోతున్నది! బట్టలన్నీ తడిసి పోయినై. బహుప్రత్నించి. ఇంటికొచ్చేదాకా ఉండేటట్లు లేదూ! ఎండకు మంచు కరుగుతుందా? ఆసంగతి నాకు ఇప్పుడు తెలిసింది!! ఇక లాభం లేదు, ఇంటికి పోయేటప్పటికి ఒక్క ముక్క అయినా మిగలదనుకొని ఆపొట్లాం ఆ పక్కనే ఉన్న ప్రెస్ ఆఫీసులో పెట్టాను. మళ్లీ వచ్చి తీసికెళ్ళతానని చెప్పి, నిమ్మకాయల సంచి తీసుకొని వస్తున్నానే. వస్తుంటే...... ఏమైందీ, ఆసందులో ఇసక — కాళ్ళు మాడిపోయినయే. అందుకని నడవలేకపోయినాను. చెప్పులుకూడా లేవాయె! నడవలేక మళ్ళీ రోడ్డుమీదికి వచ్చాను. వచ్చి అక్క డొక జట్కా కనపడితే 'మా ఇంటి కొస్తావోయ్' అన్నాను. వాడు 'మూడుఅణాలు ఇస్తేకాని రాన'న్నాడు. బేరం చేసిచేసి ఏట్లాగయితేనేం చివరకు బేడ అర్ధణాకు కట్టించుకొని రంయిన వచ్చేశాను. నిమ్మకాయలు అర్ధపావలా, అయిస్ అణా, బండికి బేడ అర్ధణా — పోత పదణాలన్నరా ఇదిగో" అని చిల్లర

నాచేతిలో పెట్టాడు.

"అయితే, రెండు నిమ్మకాయలు, అణా అయిస్ కలిసి అణాకానీతో పోయేదానికి అయిదు అణాలన్నర ఖర్చు చేసు కొచ్చాడు నీకొడుకూ" అన్నాను మా ఆవిడతో.

ఆవిడ చిన్నబుచ్చుకొని "పోనీలెండి, చిన్న వెధవ! యాభై నిమ్మకాయలు తెచ్చాడూ. ఊరగాయ వేద్దామని అను కొంటునే ఉన్నాను. పిల్లలకు చద్ది అన్నాలలోకి అయినా ఉంటుంది" అని సరిపుచ్చుకొంది.

"ముందు రెండు కాయలు పిండూ" అన్నాను నేను.

"నాయనా! కాయలు ఎక్కడ పెట్టావురా నాయనా" అన్నది వాళ్ళమ్మ.

"అరె రే రే రే రే" – అని అంటూ, పండ్లు బిగించి [illegible] మొఖం వేసి వాకిట్లోకి – వీధి గుమ్మంలోకి ఒక్కగంతులో పరుగెత్తి "ఎటుపోయిందే జట్కా" అని పసిదాన్ని అడు[illegible] తున్నాడు.

## మే రీ ఔ ర త్

"రైలుటైము అయింది. తొందరగా వెళ్ళాలె. ఆ రెండు ధోవ తులు చాలవు. ఇంకా రెండు వెయ్యి. లాల్చీలు ఎన్ని వేశావూ? మూడా? ఏమిటి నీఉద్దేశం? రోజుకు రోజుకు ఒకటైనా కావాలా? వెయ్యి ఇంకా రెండు."

"ఎందుకండీ ఇవన్నీ? ఎక్కడైనా పారేస్తారు."

"ఎక్కడైనా పారేసివస్తానూ? అంటే... నేను శుద్ధ తెలివి తక్కువవాణ్ణి అన్నమాట! ఊరికెళ్లినప్పుడల్లా పారేసుకొస్తున్నానా?"

"ఎప్పుడూ పారేస్తున్నారని కాదండీ."

"మరేమిటి, ఎందుకు వద్దనటం?"

"రెండురోజుల ప్రయాణానికి ఇన్ని బట్టలు ఎందుకు, ఏదో క్లుప్తంగా తీసికెడితే చాలదా అని నేననటం."

"అంటున్నావులే. ఆ అనటంలోనే నేను తెలివితక్కువ వాణ్ణి అయినట్లు తేలుతున్నది. ప్రతి ఆడదీకూడా తన మొగుడంత తెలివితక్కువవాడు ఈప్రపంచములో ఇంకొకడు లేడనుకొంటుంది!"

"నేనేమీ అనుకోవటం లేదండీస్వామీ. మీఇష్టం వచ్చి నన్ని తీసుకెళ్లండి. ఊరికే జాగ్రత్తకోసం చెప్పాను. దాని తరువాత మీఇష్టం."

అని వెళ్ళిపోయింది కాంతం. అల్లాగ వెళ్ళిపోవటం మటుకు నాకు చాలా విచిత్ర మనిపించింది; ఎందుకంటే - మాఆవిడ... అంత సులభంగా వదిలేసే మనిషి కాదు. పోట్లాట వచ్చిందంటే మరీ పెంకెపట్టు. సాధారణంగా లోకంలో భార్యలు భర్తలతో పోట్లాడుతూనేఉంటారు, అందులో మాఆవిడ సెకండుఫ్రంటు కూడా ఓపెన్‌చేసింది. గదిలో పోట్లాట ప్రారంభిస్తుంది. ఎట్లాగో తప్పించుకొని బైటపడినా, నడవలో మళ్ళీ ఎటాక్ చేస్తుంది. అల్లాంటి మనిషి మరి ఇల్లాగ నన్ను వదిలేసి వెళ్లి

పోవటం ఆశ్చర్యం కలుగజేసింది అంశ్చే చెయ్యమా?

సరేనని, కావలసిన బట్టలూ అవీ తీసుకొని సూటుకేసులో పెట్టి బెడ్డింగు తయారు చేసికొన్నాను. అంతా సిద్ధం అయిన తరువాత కాంతాన్ని పిలిచి, "ఏదీ..." అన్నాను హావాయి మోగించటం చూపిస్తూ.

ఆవిడ సూటుకేసువంక ఒకసారీ, బెడ్డింగు వైపు మరో సారీ, చూచి, ఆతరువాత నవ్వుతూ నాకేసి చూస్తూ నిల బడింది.

ఈచిరునవ్వులకు అర్థాలు నాకు తెలియకపోలేదు. ఊరు కొన్నాను.

"ఎందుకండీ సూటుకేసూ, బెడ్డింగూ కూడానూ? సూటు కేసులో ఉన్న ఆనాలుగు బట్టలూనూ బెడ్డింగులో వేసు కొంటే మీకు తేలికకదూ" అన్నది.

నిజమే ఆమాట. తెలివితక్కువగా రెండుశాల్తీలు తయారు చేశాను. పేటిని రైళ్లల్లో ఎక్కించటానికీ, దింపటానికీ కూలి ఇవ్వాలె. బోలెడు శ్రమానూ కాని నాకు ఆమాత్రం తోచింది కాదు.

"వచ్చావూ? ఏదో ఒక వంక పెడటానికీ! సరే. రాణీ సాహేబావారి ఆజ్ఞ ఏమిటో సెలవియ్యండి" అన్నాను.

"సరే సరే లెండి. నేను రాణీనీ కాదూ, సాహేబునూ కాదు. మీరు ఎంతలోకి సాయిబు అవుతారు!" అన్నది.

ఆవిడ అక్కడ నిలబడి చూస్తుండంగానే, సూటు కేసులోని

బట్టలు తీసి బెడ్డింగులో పడేసి ప్రయాణానికి సిద్ధమైనాను. "నాన్నా, ఒకజట్కా పిలూ" అని కేకేశాను మాఅబ్బాయి కోసం.

మరి రెండు నిమిషాల్లో జట్కా ఇంటిముందు నిలబడింది. నేను ఎక్కి కూర్చున్నాను. కాంతం వాకిట్లోకి వచ్చి, "జాగ్రత్తగా రండి. శాలువకూడా తీసుకెడుతున్నారు." అన్నది ఆముద్దాగా చూస్తూ. ఆశాలువ పారేస్తాననే ఆమె అనుకోటం. పారేయటం కొంచెం హెచ్చుతగ్గుగా నిశ్చయమనే ఊహించి "జాగ్రత్త, జాగ్రత్త" అంటూనే ఉంది. నేను బండి వాడితో "పోనియ్యవోయ్" అన్నాను. బండి సాగిపోతున్నా కూడా ఆవిడ, "ఏమండోయ్" జాగ్రత్తసుమండీ, బెడ్డింగు ఎక్కడైనా విడిచివచ్చేరు. తువాలాలూ అవీ ఉన్నాయి." అంటూ చెప్పింది.

బండి దుకాణాలు దాటి మలుపు తిరిగింది. ఇంతలో మారాధాయ పరుగెత్తుకుంటూ వస్తున్నాడు. వాడు రొప్పుకుంటూ వచ్చి "అమ్మ ఒకసారి రమ్మంటున్నది" అని చెప్పాడు. నేను విసుక్కుంటూనే దిగి వెళ్లాను. ఆమె లోపలికి తీసికెళ్లి "డబ్బు తీసుకోకుండా వెడుతున్నారేం" అన్నది. పర్సు జేబులో వేసుకొన్నాను గాని ఆవిడనడిగి డబ్బు తీసుకోటం మరిచిపోయినాను.

"నయమే, ఏదీ ఇయ్యి!" అన్నాను.

"ఎంత ఇయ్యమంటారూ!"

"పాతిక, ఊఁ, చప్పున ఇచ్చేసెయ్యి."

"పాతి కెందుకండీ—రాజమండ్రి వెళ్ళి రావటానికి?"

"అక్కడినుంచి యకాయకీని బెజవాడ—మీదుగా నరసా రావుపేట వెడతాను. అమ్మాయిని చూడటానికి."

"ఒక మాట వినండి. మీరు చాలా రోజులు ప్రయాణం చేయలేరు. రాజమండ్రినుంచి ఇల్లా వచ్చి ఒక రోజు ఉండి, ఆతరవాత అమ్మాయిదగ్గరకు వెళ్ళండి. ఈలోపున దాని కోసం కొని ఉంచుతాను. నామాట విని ఈపదీ తీసుకెళ్ళండి. మిగతా పదిహేనూ నాదగ్గర ఉండనివ్వండి" అని బ్రతిమిలాడింది.

నేను ఆవిడచేతిలో ఉన్న కాయితాలన్నీ లటిక్కిన లాక్కుని పర్సులో పెట్టుకొని—"నీవు ఊరుకో. నాకేం ఫరవా లేదు. మళ్ళీ ఇటు రాను. ప్రోగ్రాము ఒకమాటు స్థిరపడిం తరు వాత మార్చటానికి వీల్లేదు" అని అధికారిలాగ అన్నాను. ఆవిడ చిన్నబుచ్చుకొని "సరే, మీఇష్టం" అని నన్ను వీధిలోకిపంపి ఇంకోసారి "జాగ్రత్త" అని చెప్పి దీనంగా చూసింది. నేను నవ్వుతూ బండి ఎక్కి 'ఊఁ' అన్నాను. "మళ్ళీ ఎప్పుడొస్తారూ?" అని ఆవిడ అడిగింది బండి సాగేంతరువాత. "రేపు రాజమండ్రిలో ఉంటా ననుకో, అక్కడనుంచి నరసా రావుపేట వెళ్ళి రెండురోజు లుండి నాలుగోనాటికి తిరిగి వస్తాను" అన్నాను. "అమ్మాయి చేతులో ఆపదిరూపాయిలూ పెట్టండి. ఇంకో విధంగా ఖర్చుచేయక" అని కేక వేసింది. నేను తల ఊపి ఊరుకొన్నాను.

ఆ వెళ్ళటం వెళ్ళటం నేను రాజమండ్రి పోయినాను. అక్కడికి ఎందుకు వెళ్ళాలిసివచ్చిందీ అంటే — కాంతం స్నేహితురాలు ఒకర్తె అక్కడ శానిటోరియంలో ఉంది. ఆమెను చూడాలని కాంతం తహతహలాడింది. ఆమె వెడితే నేనూ వెళ్ళాలి. ఇద్దరం వెడితే డబ్బు ఎక్కువఖర్చు అవుతుందని నేను ఒకణ్ణే చూసివస్తానని మాఆవిడకు చెప్పాను. ఆవిడ సరేనని ఒప్పుకున్నది. అదీ నాప్రయాణానికి కారణం. డబ్బు కర్చు తగ్గించే ఏవిషయమైనా కాంతానికి ఇష్టం. నేనుకూడ ప్రతి విషయంలోనూ ఇప్పుడు జాగ్రత్తగా ఉంటున్నాను.

రాజమండ్రిలో దిగి దగ్గరలో ఉన్న కాఫీహోటలులో ఒక్క ఇడ్డెను, అరకప్పు కాఫీమాత్రమే పుచ్చుకున్నాను. "డబ్బు జాగ్రత్తగా వాడండి" అని కాంతం నొక్కి నొక్కి చెప్పినమాటలు నేను మరచిపోయి ఎక్కువ సొమ్ము పాడు చేయటం తప్పు అని తోచింది. ప్రయాణం పొడుగునా నేను ఒక్క దమ్మిడీఅయినా అనవసరంగా కర్చు చేయదలుచుకో లేదు.

అటుతరువాత మాఆవిడ స్నేహితురాలిని చూడటానికి శానిటోరియముకు బయలుదేరాను. శానిటోరియం వీరభద్రా పురానికి కొన్నిమైళ్ళ దూరంలో ఉందని తెలిసింది. నడిచి వెళ్ళటం కష్టం అని తోచింది. అదీకాక ఎండ తీక్షణంగా ఉండేలాగ కనుపించింది. అది మాఘమాసం, పగలు మండు టెండ. రాత్రిళ్ళు చలీనూ, బండొకటి మాట్లాడుకొని వెడదా

మనుకొన్నానుగాని, రానూపోనూ రూపాయిన్నరకు తక్కువైతే బండి కట్టనన్నారు. రూపాయిన్నర ఖర్చుచేయటానికి ఏమాత్రం మనస్సొప్పలేదు. ఒక్క నిముషం తటపటాయించి గిరుక్కునతిరిగి వీరభద్రాపురందారి పట్టాను. వీధులలో దుమ్ము ఎత్తిపోస్తున్నది. పోను పోను ఆదుమ్ము మరీ ఎక్కువైంది. నడిచీ నడిచీ సుమారు పదకొండుగంటలకు శానిటోరియం చేరాను.

ఒక గుట్టపైనున్న ఆ ఆరోగ్యశాలలో అన్ని ఏర్పాట్లూ ఎంతో బాగా ఉన్నాయి. క్షయదగ్గు మహాభయంకరమైన వ్యాధి అనీ, ఆరోగులు పీనుగులలాగ ఉంటారనీ అనుకున్నాను. కాని అక్కడున్న రోగులలో చాలామంది మంచి మనుష్యుల లాగే కనబడ్డారు. శేషమ్మగారూ, ప్రయాగమ్మగారూ కూడా ఆరోగ్యంగానే కనిపించారు. కాని ప్రయాగమ్మగారు అంతకు పూర్వపు రాత్రే నెత్తురు కక్కుకొన్నదట. క్షయదగ్గు మహా తమాషా అయిన జబ్బు. ఆరోగ్యంగా ఉన్నట్లే ఉండి పుటిక్కిన తాడు తెంచుతుంది. వాళ్ళతో కబుర్లు చెబుతూ ఒంటిగంటదాకా గడిపాను. అక్కడనుంచి వాళ్ళకు విశ్రాంతి సమయము. ఎవ్వరూ అక్కడ ఉంటానికి వీలులేదు. అందుచేత నేను వాళ్ళతో చెప్పేసి ఊళ్ళోకి వచ్చేసరికి మూడుగంటలైంది. హోటల్లో ఒక రకం భోజనం ఆరు అణాలనీ, మరోరకం పావలా అనీ చెప్పారు. ఇందులో రెండోరకం భోజనంతోనే తృప్తిపొందాను. బెజవాడ వైపు వెళ్ళే రైలు ఒకటి నాలుగు

గంటలకే ఉందని తెలిసింది. వెంటనే స్టేషనుకు వెళ్ళి టికెట్టు కొని, రైలులో చేయవలసిన ప్రయాణం అంతా చేసి పడవలసిన అవస్థలన్నీ పడి ఆరోజు రాత్రికే ఇంటికి వెళ్ళవలసినవాణ్ణి మర్నాడు పది గంటలకు కొంపజేరాను.

౨

బండి ఇంటిముందు ఆగటంతోటే చిన్నపిల్లలు ఇద్దరూ వచ్చి బండీదగ్గర నుంచున్నారు. పెద్దపిల్లలు ముగ్గురూ వీధి వాకిట్లో నుంచుని "అమ్మా నాన్నొచ్చాశేవ్" అని కేకవేశారు. నేను బండి దిగి ఇల్లోకి అడుగు పెట్టగానే వంటఇంట్లోనుంచి మాఆవిడ రావటం కనపడ్డది. "అప్పుడే వచ్చారేం? అమ్మాయి అత్తవారింటికి వెళ్ళలేదా?" అని రెండు ప్రశ్నలు నామీద విసిరి, నేను ఏమీ చెప్పకముందే బండివాడితో "బెడ్డింగు బండిలో ఉంది కాబోలు, తీసుకొని రావేమి అబ్బాయ్" అన్నది. "అయ్యగారు బెడ్డింగూ ఏమీ తేలేదండి" అంటూ వాడు బండికిరాయి పుచ్చుకొని వెళ్ళిపోయినాడు. కాంతం తెల్లపోయి నావంక జూచి 'బెడ్డింగు ఏమిచేశారు?" అని అడిగింది. ఊరికే మాటవరస అల్లా అడిగిందేగాని, నేను ఆబెడ్డింగు ఎక్కడో పారేసివచ్చానని ఆవిడిగారు ముందుగానే నిశ్చయించుకొంది. నేనన్నానూ "ఊరికే హడలిపోకు. బెడ్డింగు వెనకనుంచి వస్తూంది" అని. "ఎక్కడైనా వదలివేసి వచ్చారా" అని మళ్ళీ అడిగింది కొంచెం ఆశతో

నేను నవ్వి 'అవును' అని వంటింటివేపు నడిచాను. ఆవిడ సంగతి గ్రహించి "స్నానం చెయ్యండి" అంది. నేను వెంటనే స్నానం కానిచ్చి పిల్లలతో కలిసి భోజనం చేస్తున్నప్పుడు కాంతం మళ్ళీ, "ఏమండీ, అమ్మాయిదగ్గరకు వెళ్ళలేదేం" అన్నది. "ఏదో ప్రయాణం చేయలేకపోయినాను. రాజమండ్రి నుంచి ఇల్లా యకాయకీని వచ్చేశాను. రెండురోజులుండి కాస్త బడలిక తీర్చుకొని వెడతాను" అన్నాను. "ఆబెడ్డింగు బెజవాడలో పారేసి వచ్చారు కామోలు" అంది. నేను నవ్వి ఊరుకున్నాను. "శాలువా అవీ జాగ్రత్తగా ఉన్నవికదా" అని మళ్ళీ అడిగింది - నాకు కోపం వస్తుందేమోనని కొద్దిగా భయపడుతూనే. "ఎందుకే హడలిపోతావు కాంతం? నే నేదన్నా తీసికెడితే మళ్ళీ ఇంటికొస్తుందని నీకు నమ్మకం లేదన్నమాట!" అన్నాను. ఆవిడ ఆమాటమీద కాస్త నొచ్చుకుని " ఆ, అదిగాదండీ, ఊరికే అడిగాను. మరేంలేదు. సరేకానీండి, మీరు రాజమండ్రిలో ఎప్పుడు బయలుదేరారూ?" అని విషయంమార్చింది. "చెప్పవలసిన సంగతులు చాలా ఉన్నాయి. భోజనం అయినతరువాత చెప్పుతా" నంటూ పెరుగూఅన్నమూ తినేసి నేను ముందుగా వెళ్ళి పడకకుర్చీలో కూలబడ్డాను. ఒక్క గంటసేపు కునుకుపట్టింది. అప్పటికి కాంతం వచ్చి తమలపాకులూ వక్కలూ నాముందుపెట్టి "ఆ, ఏమిటండీ సంగతులు" అంటూ చాపమీద కూర్చున్నది. నాదగ్గరనుంచి వెంటనే జవాబు రాకపోవడం కనిపెట్టి

ప్రయాణం సంగతులు ఏమిటండీ ? ఎప్పుడు బయలుదేరారు రాజమండ్రీలో " అని మళ్ళీ అడిగింది.

" నిన్న నాలుగుగంటలకు గోదావరి స్టేషనులో రైలు ఎక్కాను. "

" అయితే రాత్రి బెజవాడలో ఆగారన్నమాట. రంగయ్య అన్నయ్యఇంట్లో ఉన్నారా ? మీ తమ్ముడింటి కెళ్ళారా !"

" రంగయ్యఇంటికీ కాదు...మా తమ్ముడింటికీ కాదు. "

కాంతం తెల్లపోయి " అయితే హోటల్లో ఆగారన్న మాట. పక్కచుట్టకూడా ఆహోటల్లోనే పారేసివచ్చారా ?" అని భయాన్ని కనపరిచింది.

" వీలు చిక్కితేసరి, నేను పారేసేననే అంటావు !"

" మరి హోటల్లో - పదిమంది వచ్చిపోయేచోట - నిక్షేపమంటి బెడ్డింగు - శాలువకూడా ఉండేఅందులో - వదిలేసి వస్తారటండి ?"

" పోట్లాటకు తయారై కూర్చోకు. అసలు నేను హోటల్లో వదిలేసివచ్చానని ఎవరు చెప్పారూ."

" ఆఁ, అయితే ఎక్కడ తగలేశారూ !" అన్నది ఆవిడ భయమూ, విచారమూ సూచిస్తున్న గొంతుకతో.

" నీవు...ఎగిరిపడక... "

" నేను అనుకొంటూనే వున్నాను. "

" ఊరుకో...ఊరుకో...ఎక్కడికీ పోలేదు బెడ్డింగు. రెండు రోజులలో వస్తుంది. కొన్ని కారణాలచేత ఒక స్నేహితునివద్ద

వదలవలసి వచ్చింది." అని శాంతంగా జవాబు చెప్పాను.

"ఏమి టా కారణాలు ?"

"అవీ అడగవలసిన ప్రశ్న. అట్లాఅడుగూ చెపుతాను" అని ప్రారంభించాను. "ఇక్కడనుంచి వెళ్ళానా రాజమండ్రి ? మీా శేషమ్మను చూశాను."

"కులాసాగా ఉందా ?"

"ఆ – సుఖంగా ఉంది. నీవు ఆదుర్దాపడాల్సింది ఏమీా లేదు. చూచి ఆరోజు – అంటే నిన్న నాయంత్రమే బయలు దేరాను."

"పనసపొట్టు కొనమంటిని గదండీ."

"కొనటానికి వీలులేకపోయింది."

"ఆ, నా బొంద, వీలులేకపోవటం ఏమిటి ? పిల్లలకు ఎంతో ఇష్టం. ఇక్కడ దొరుకుతుందా ఏమన్నానా ! చెప్పినమాట వినరామె !"

"నీ మాట వినాల్సిరావటంచేతనే అది కొనలేదు."

"అదేమిటండీ ?–"

"చెపుతా ఏమిటో – చెప్పనిస్తేగా ?"

"ఊఁ............"

"నేను ఆసుపత్రి కెళ్ళొచ్చేసరికి మూడుగంటలైంది. కొనా లంటే పనసపొట్టు ఊళ్ళోకి పోవాలి. అల్లాగ వెడితే ఆపూట రైలు అందేదికాదు. ఆరాత్రి అక్కడుంటే పూటకూళ్ళింటికి పావలా, పడుకొనేందుకు గదికి అద్దె అర్ధరూపాయి – ముప్పా

వలా దండుగ. అందుకని వెంటనే ఉన్న బండిలో రావటం గలిగింది."

"సరే. అల్లాగయినా రాత్రికి రావలసింది. ఈపూట వచ్చారేం? — బెజవాడలో హోటల్లో తగలేశారు! ఎక్కడైతేనేం?"

"లేదు. బెజవాడ వెళ్ళనేలేదు"

"అయితే - ఎక్కడున్నట్లూ?" అన్నది ఆశ్చర్యముతో.

"ఆ సంగతే చెపుతాను. నీవు కొంచెం ఓపిగ్గా వినాలి."

"ఒక కథలాగ అన్నమాట."

"ఊఁ. అల్లాగే అనుకో" అన్నాను నేను.

"సరే కానివ్వండి." అన్నది ఆవిడ.

"రాజమండ్రి నుంచి బందరు రావటానికి రెండు మార్గాలున్నవి. బెజవాడ మీదుగా రావటం ఒకటీ, భీమవరం మీదుగా రావటం మరొకటీ."

"మీరు బెజవాడ మీదుగా రాలేదని చెపితిరిగా."

"బెజవాడ మీదుగా రాలేదన్నాను గాని భీమవరము మీదుగా వచ్చానని చెప్పానా?"

"ఊహూఁ... ఇప్పుడు చెప్పండి."

"అదే భీమవరంమీదుగా వచ్చాను. ఆ రావటంలో..."

"నిడదవోలుమీదుగా వచ్చారు. అంతేగదూ. మీరు ఊరికే గాలి పోగుజేసుకొని కథ అల్లుకొస్తారు. వినేవాళ్లకు వినుగొస్తుంది. మీకేం? ఇంతకు ఆ బెడ్డింగు ఎవరింట్లో పడేసి

వచ్చారో చెపితే నే వెళ్ళి కాస్త నడుము వాలుస్తా."

"సరే, నీ వింత తొందరపడుతున్నావు కాబట్టి రాజమండ్రి నుంచి నిడదవోలుదాకా జరిగిన విశేషాలు చదిలేస్తున్నాను. అయితే ఒక్కటి. డబ్బు కలిసివస్తుందని రాజమండ్రీనుంచి నిడదవోలుకు ఓ టిక్కెట్టు కొనుక్కొని అక్కడనుంచి భీను వరానికి మరోటి కొన్నాను. ఎందుకో తెలుసునా? ఇది సయం. విడివిడిగా కొనటంవల్ల ఓ ఆరణాలు కలిసొస్తయి" అని ఆవిడవంక చూశాను నన్ను మెచ్చుకొంటుందని. ఆవిడ "ఊఁ, కానివ్వండి" అన్నది ఓమోస్తరు విసుగుతో, ఆవలించి చిటిక వేస్తూ. "మరి శ్రమ అయినా ఇల్లాగ విడివిడిగా...టిక్కెట్టు పుచ్చుకొని రావటం - సొమ్ము దమ్మిడీకూడా అనవసరంగా పాడుజేయకపోవటం - చూశావా మరి ! !"

అన్నాను. ఆవిడ కొంచెం నవ్వి "చాలా మంచిపని చేశారు" అని నొక్కి అన్నది. "అదే ఆకాస్త మాటకోసమే నేను పరితపిస్తూన్నా" అని ఆమెబుగ్గను తర్జనితో తాకాను. 'ఊఁ' అని విసుక్కొంది. ముద్దుకు అలా అన్నా నన్నాను.

"ఇంకా ముద్దులూ ముక్కలూనూ !"

"ఏం !"

"పెద్దవాళ్ళ మైపోవటంలే !"

"అల్లా అనకు. ఏముద్దు కాముద్దే! పడుచుదనపు మిస మిసలు ఎంత ముద్దో, ముసలితనపు ముడతలూ అంతే ముద్దు. వృద్ధాప్యంమటుకు ముద్దయిన కాలంగదూ"

"అయితే కావచ్చు. మీరు ఈగొడవలోకి దిగక ఆపరుప్పు చుట్ట ఎక్కడ పారేసి వచ్చారో చెప్పండి."

"అదుగో పారేశారనే నీవనుకోటం-!"

"నా అనుకోటంతో మీ కెందుకండీ-ఏపూళ్ళో ఎవరింట్లో పడేసివచ్చారో చెప్పండి-నన్ను వేధించక."

"ఆ సంగతి నన్ను చెప్పనిస్తేనా? ఫలానిచోట దిగబెట్టి వచ్చాననూ అంటే అక్కడి కెందుకెళ్ళారూ అంటావు. అందు కని నే చెప్పదలచుకొన్న రీతిని చెప్పనియ్యి."

"అల్లా అయితే సరే—" అని దగ్గరలో నున్న పట్టె మంచం వాల్చుకొని పడుకొని — "ఇక మీఇష్టం" అన్నది నేనూ ఒక సిగరెట్టు వెలిగించాను.

## 3

"భీమవరం చేరానా...అక్కడే గొడవ జరిగింది. కిటికీదగ్గిర కెళ్ళి అందఱలాగే టిక్కెట్టు అడిగితే ఆయన ఇయ్యక, 'అటు తిరిగిరండి లోపలికి' అన్నాడు."

"ఎంచేతా?"

"అదే తమాషా. అందరికిమల్లే నాకూ ఒక టిక్కెట్టు తీసిఇస్తే, చెప్పేదేముంది? సరేలోపలికి వెళ్ళాను. 'కూర్చోండి మాస్టారూ, ఈనలుగురినీ పంపించి మీతో మాట్లాడతానూ' అన్నాడు."

"ఇంతేగదా. వాడెవరో దరిద్రుడు మీదగ్గర చదువుకొని ఉంటాడు."

" సరిగ్గా అంతే. నాకైతే జ్ఞాపకంలేదు. వాడు తనపల్లపునీ పంపించి నాదగ్గరకొచ్చి క్షేమం అడిగి, టీ ఇప్పించి, ఎంతో గౌరవించాడు. "

" సరే-మామూలే."

" అవునా, ఆపళంగా, బందరుకో టిక్కెట్టు ఇయ్యమంటే ఇయ్యడే- "

"ఓహో - ఆరోజుకు...అదే ఆ పూటకు వాళ్ళ యింట్లో భోజనం చెయ్యమని కూర్చున్నాడు కామాలు. "

" కాదు, కాదు. 'ఏకాయకీని బందరు వద్దండి మాష్టారూ. కైకలూరుదాకా తీసికోండి. అక్కడినుంచి మళ్లీ ఇంకోటిక్కెట్టు కొనండి. మీకు ఓ పావలా కలిసొస్తుంది' అన్నాడు. 'వద్దు ఓయ్ _ ఈగొడవంతా నేను పడలేను. ఇప్పటికి పడ్డనిచాలూ. బారుటిక్కెట్టు ఇవ్వవయ్యా' అంటే - 'అల్లా నేనెప్పటికీ ఇవ్వ నండీ. రేపు ఎప్పుడైనా కనపడ్డప్పుడు పిన్నిగారు— 'ఏమోయ్, నీకైనా తెలియదా? మాష్టారికి పావలా దండుగ బెట్టిం చావు' అంటే నేనేమనేది చెప్పండి? అన్నాడు. 'అయితే .. నీకు మాఆవిడకూడా తెలుసన్నమాట' అనేసరికి ఆకుర్రాడు 'సారి! బాగుందండోయి మాష్టారూ. మీరు అంతా మరిచి పోయినారన్నమాట. నేను మీరున్న ఇంట్లో వీధిగదిలో ఉండే వాణ్ని. మీకు కూరలూ అవీ నేనే తెచ్చేవాణ్ని. పండగ పండగకూ మీ ఇంట్లోనే భోంచేసేవాణ్ని. నేను సుందరా వ్నండీ మాష్టారూ' అన్నాడు. 'ఓయ్ నువ్వటోయ్' అని

నేను వాడి పీపుమీద చరిచాను — అప్పటికి జ్ఞాపకం వచ్చిన వాడిలాగ, నిజానికి వాడెవరో అప్పటికీ ఇప్పటికీ నాకు జ్ఞాపకం రానేలేదు. అంతటితో వాడు ఊరుకోక 'పిన్నిగారు నాచేత కూరలూ అవీ తెప్పించేటప్పుడు ఒక్క దమ్మిడీ ఎక్కువ ఖర్చుచేస్తే కూకలేస్తూండేవారు. ఒకటండీ మాస్టారూ మీరుచెప్పిన చదువువల్ల నాలుగుడబ్బులు సంపాదించటం నేర్చుకొంటే, వారు చెప్పిన చదువువల్ల నాలుగు రూపాయలు వెనకేసుకోటం నేర్చుకొన్నానండీ' అన్నాడు."

"ఎవరండీ ఆ అబ్బాయీ, అయినా సంవత్సరానికో కుర్రాడు, ఎవరో ఒకరు మనయింట్లో తిరుగుతూఉంటూడాయె. జ్ఞాపకం ఉండదు. అయినా మీకంటే వాడే నయం."

"సరే. టిక్కెట్టు కైకలూరుకే తీసుకోక తప్పింది కాదు. ఆకుర్రాడు నన్ను రైలెక్కించి 'కైకలూరులో బండి చాలా సేపు ఆగుతుందండీ. మీకేమీ తొందరపడాల్సిన అగత్యం లేదు.' అని చెప్పి వెళ్లిపోయినాడు. దాని తరువాత......"

"అబ్బబ్బ! ఏదోకథలాగ ఎందుకండీ ఈగొడవంతానూ."

"కొంచెం ఓపిక పట్టు నువ్వూ."

"ఇంతకూ ఆబెడ్డింగు కైకలూరులో ఎక్కడైనా వదలి వచ్చారా?"

"అవును. కైకలూరులో ఒకాయనకు ఇచ్చివచ్చాను."

"ఎందు కిచ్చారు?"

"అదే - ఆప్రశ్నకే నేను సమాధానం చెప్పాలె. తొందర

పడితే ఎల్లాగ? కైకలూరులో దిగి టిక్కెట్టు కొంటానికి వెళ్ళాను. కిటికీదగ్గర జనసమ్మర్దన ఎక్కువగాఉంది. ఎట్లాగో తోసుకెళ్ళి టిక్కెట్టుకొని పరుగెత్తుకొంటూ రైలుదగ్గరకు వచ్చేశాను."

"రైలు అందలేదు కామాలు."

"ఊఁ — రైలు అందకేం — చక్కగా అందింది. కాని తరవాత సిగరెట్టు కొనుక్కుందామని మనీపర్సుకోసం జేబులో చెయ్యి పెడుదును గదా..."

"ఊఁ" అన్నది కాంతం హడలిపోయి.

"పర్సు కాస్తా కనపడలేదు."

"అయ్యో, అయ్యో, పర్సు పారేశారుటండీ? నన్ను తగలెయ్య... .. అయ్యయ్యో, మొఱ్ఱో వద్దని మొత్తుకొన్నా విన్నారుకారు. ఎంతఉంది అందులో"

"ఇరవైరెండు రూపాయలున్నయి"

"ఇరవైరెండు రూపాయలూ పోయినైటండీ? మాట్లాడరేమండీ?...నన్ను తగలెయ్య... అట్లా చూస్తారేమండీ... పారేశారు కామాలు. అంతాపోయినట్లేనా......" అంటూ తెల్లపోయింది కాంతం.

ఏంజెప్పేది? తెల్లమొఖంవేసి "పోయింది, అంతా ఊడ్చుకుపోయిం" దన్నాను. "అంతా పోయిందండీ, అంతా పోయిందండీ" అని ఆవిడ కాసేపు విచారపడి, "ఎట్లాపోయిందండీ" అన్నది. "ఆ టిక్కెట్టు తీసుకొనే సందట్లో ఎవరో జేబులో

నుంచి లాగేశారు ”

“ పక్క జేబులో పెట్టారు కామాలు. బనియన్ జేబులో పెట్టుకోకపోయినారుటండీ ”

“ అవునుమరి. అట్లా జరిగింది. ఏంజేసేది ? ఎన్నిసార్లు ప్రయాణం చేశాను కాను ? ఇంతకూ ఆరోజున అల్లాగ దరిద్రం చుట్టుకొన్నది”

“ఎవరు కాజేశారో?”

“ ఎవరు కాజేశారో తెలిస్తే వాడ్ని అక్కడే పాతేద్దును. తెలియలేదు. ”

“ పరుగెత్తేటప్పుడు క్రింద ఏమైనా పడిపోయిందేమో వెదికారూ ? ”

“ పరుపులో ఏమైనా పెట్టి మరచిపోయినానేమోనని పరుపు అంతా ఖంగారుగా వెతుకుతుంటే అక్కడున్నవాళ్ళు నా ఆదుర్దాచూసి ‘ఏమిటండీ’ అని అడిగారు. నేను ఈవిషయం చెప్పాను. ‘ క్రింద ఏమైనా పడిపోయిందేమో వెదకండి. వెళ్ళి పోలీసుకు రిపోర్టు అయినా ఇవ్వండి ’ అంటూ చెప్పారు ”

“ మరివెతుక్కోరుటండీ. నాముఖం - ఇంతమాత్రం తెలియ లేదండీ మీకు ” అన్నది ఆవిడ.

“ వెతకటానికి టైముఏదీ ? అప్పటికప్పుడే రైలు కూసింది. ఇది వెదకటానికి వెడితే రైలు కాస్తా పోతుందని భయం వేసింది. అందుకని ఊరుకొన్నాను. ”

“ అయితే ఇంతకూ పర్సుకోసం వెదకనే లేదన్నమాట. ”

"అహా, ఆపెట్టెలో వాళ్ళంతా 'దిగి వెళ్ళండి, వెతుక్కోండీ' అని తొందరపెట్టారు."

"వెదుక్కోరుటండీ."

"అందుకనే - ఎట్లాగ ఈ పసుపుచుట్టకూడా దింపుకుందామా - ఒకవేళ రైలు ఉండదేమో.అని ఆలోచిస్తూ ఉండంగానే, ఒకాయన 'మాస్టారూ, మీ బెడ్డింగు నేను చూస్తూ ఉంటాను. మీరు వెళ్ళి వెతుక్కోండి' అన్నాడు. నాకు ఇంకో నిమిషం ఆలోచనకు టైము లేకపోయింది. 'ఇదే నా బెడ్డింగు మీరు జాగ్రత్తచేయండి' అని చెప్పి తొందరగా చూచి మళ్ళీ వద్దామని వెళ్ళాను. అక్కడ ఎవ్వరూ మనుష్యులూ లేరు; పర్సూ లేదు. సరేనని తిరిగి పరుగెత్తుకుంటూ వచ్చే సరికి రైలు కదిలింది. ఎక్కలేకపోయినాను"

"బాగానే ఉంది. అక్కడ దిగబడిపోయినా రన్నమాట."

"అవును-మరి ఏం జేసేది? ఆపళంగా వెళ్ళి స్టేషనుమాస్టరుతో చెపితే ఆయన-'ఇక్కడ జేబుదొంగ లున్నారండీ...... రోజూ ఇల్లాంటి రిపోర్టులు వస్తూనే ఉన్నవి' అన్నాడు."

"ఏం దరిద్రమండీ! పర్సు పర్సుపాళంగా ఎవరో కొట్టేశారు." అని కాంతం తను కనిపెట్టిన విషయం చెప్పింది. నే నేమీ మాట్లాడలేదు. మళ్ళీ అన్నది కాంతం — "నేను అంత పైకం తీసికెళ్ళవద్దండీ, నా ముఖాన పారేసి వెళ్ళండీ అంటే విన్నారూ? బిళ్లకుడుములాగ ఇరవై రూపాయలూ వాడి ముఖానపెట్టారు. ఎంత తెలివితక్కువండీ!"

నాకు వళ్ళు మండిపోయింది. "నన్ను అనవసరంగా అంటావుగాని, ఇందులో నా తెలివితక్కువ ఏముందమ్మా కాంతం" అన్నాను.

కాంతం ముఖం చిట్లించి, "బారు టిక్కెట్టుకొంటే ఏఅవస్థ లేకపోయేది" అన్నది. అదీ నా తెలివితక్కువ అన్నట్లు.

"పావలాడబ్బులు కలిసొస్తాయి అని గదూ నాగోల!"

"నాబొంద పావలా ఇప్పుడేమైంది!"

"ఇల్లా అవుతుందని నేను అనుకొన్నానా?" అన్నాను నేను జాలిగా.

కాంతం కూడా నావంక జాలిగా చూసింది. ఆచూపులో 'మీ తప్పు ఇందులో ఏమీ లేదు. పాపం.' అన్నమాటలు ఉన్నవి.

అల్లాగ ఒక క్షణం చూచి సానుభూతితో "ఏదోలెండి. ఇంతకూ బయలుదేరిన గడియ మంచిదికాదు." అని తృప్తి పరచుకొని చివరకు "ఇరవైరూపాయలుగదా-ఏం జేస్తాము. పోతేపోయినై లెండి. ఇబ్బంది పడకుండా వచ్చారా? ఆరాత్రి ఎక్కడున్నారూ? రావటానికి చేతులో డబ్బుఉన్నదా ఏమైనా-పోయింది పోగా?" అంటూ నాలుగు ప్రశ్నలూ ఆనుగ్దాగా అడిగింది.

"చేతులో ఆటిక్కెట్టు ఒక్కటే – అది మారిస్తే మళ్ళీ పావలా వచ్చింది."

"అయితే. అవస్థ పడ్డారన్నమాట!"

"అవస్థ అంటే అవస్థా. నే నెప్పుడూ అంత అగచాట్లు పడలేదు."

"అయ్యో? ఆ రాత్రి తిండీ తిప్పలూ లేవు గాబోలు. ఎవరూ స్నేహితులు లేకపోయినారండీ?"

"ఒక తాల్పూష్పుడు ఉన్నాడు."

"వెళ్ళకపోయినారా ఆయనఇంటికి?"

"వెళ్ళాను. ఆయనభార్య కడుపుతో ఉందట. కంటానికి పుట్టింటికి వెళ్ళింది. ఆరోజు ఆదివారం కావటంచేత ఆయన కూడా వెళ్ళాడు. ఇల్లు తాళం పెట్టి ఉంది."

"ఊంహూం."

"అన్నీ అల్లాగ కలిసొచ్చినై."

"చాల్లెండి. ఇక ఊరుకోండి."

"ఊరుకోక ఏం జేసేదిలే!...నోరు నొక్కుకుని మరీ ఊరు కొన్నాను, చేతిలో ఉన్న పావలాలో ఒక బేడకు ఏవో అరటి పండ్లూ అవీ కొనుక్కొని తిని ఊరుకొన్నాను. ఇంతకూ ఆ రాత్రి హోటలులో బెంచిమీద పడుకొన్నాను."

"అయ్యయ్యో! ఎంతఅవస్థపడ్డారండీ. మిమ్ముల నెప్పుడూ ఒంటిరిగా ప్రయాణం చేయనీయకూడదు. ఇదే చెప్పటం — వింటున్నారా? ఇక్కడినుంచి మీరు ఎక్కడికి వెళ్ళినా నన్ను తీసికెళ్ళండి. మహాబాగుంది మీ అవస్థ...అయితే ఆ పర్సు పోవటం సంగతి నలుగురికీ చెప్పకపోయినారా? మీ రెందుకు చెపుతారూ? ఏం? చెప్పారా?"

" ఎందుకు చెప్పనూ ? చెప్పాను "

" ఏమన్నారు ? "

" ముందు నా దేవ్వూరైందీ నాకేంపని అయిందీ. నాకెంత జీతం అయిందీ తెలుసుకొన్నారు. తెలుసుకొని ' ఏంపనయ్యా నూరురూపాయల జీతగాడివి ! పావలాకోసం లోభించి స్టేషను స్టేషనులో దిగి టిక్కెట్టు పుచ్చుకొన్నా అంటావు' అని చీవాట్లు వేసి ' ఎవరు చెప్పారయ్యా నీ కీబుద్ధి ! ' అని అడిగారు. మా ఆవిడ చెప్పిందని అందామనుకొని మళ్ళీ ఊరుకొన్నాను నవ్వీపోతారని. ఏపర్నాడు ప్రొద్దున్నే గుడివాడ కారు ఎక్కి గుడివాడలో ఒక మాస్టరుదగ్గర కావలసిన డబ్బు అప్పు పుచ్చుకొని ఆపళంగా రైలెక్కి వచ్చేశా " అని పూర్తిచేసి మళ్ళీ ఇంకో సిగిరెట్టు వెలిగించాను.

౪

" ఇంతకూ ఆబెడ్డింగు సంగ తేమైంది ? అందులో పది పది హేను రూపాయల శాలువా, పదిరూపాయల బట్టలూ ఉన్నాయి గదా. అదికూడా ఊరేగలేదుగదా" అన్నది కాంతం ఒక్క క్షణం అయినతరువాత.

" నే చెప్పానుగా, ఒకాయన కిచ్చానని. "

" చెప్పారు లెండి. ఆయన ఎవరో, ఏ పేటలో ఉంటాడో మీకు గట్టిగా తెలుసా ? "

" అసలు ఆయనది ఏవూరోకూడా తెలియదు చూచిన మొఖం ! ! "

"నాబొంద, మీరు చూడని ముఖం అటూ ఉందటండీ. ఆయన ఎవరో, పేరేమిటో తెలుసుకోకుండా బెడ్డింగు ఎల్లా ఇచ్చారండీ?"

"నేను ఇచ్చానా? ఆయన చూస్తూఉంటానన్నాడు. నేను సరేనన్నాను. పేరూ ఊరూ అడగటానికి వ్యవధీ లేదూ, ఇంతకూ నాకు తోచనూలేదూ - చెప్పద్దూ"

"ఎందుకు తోస్తుంది, అమ్మవారు నెత్తినెక్కి తొక్కుతుంటే — అయ్యో! అయ్యో! పాతికరూపాయలూ పాడై పోయినై ఆయె. అమ్మాయికి ఇంకా చీర కొందామను కొంటున్నా. ఇంకేమికొనేది? నేను నెత్తిన నోరుట్టుకుని మొత్తుకొన్నా - డబ్బు అంతా తీసికెళ్ళబోకండీ అని. నామాట విన్నారూ?"

"పొరపాటేనే కాంతం - ఇక్కడనుంచి తప్పకుండా వింటాను చూస్తూండు."

"నాబొంద, ఇదివరకెన్నిసార్లు అన్నారు ఇల్లాగ! తీరా సమయమొచ్చేసరికి ఎగిరిపడతారాయె, సరే లెండి. ఏం అనుకొని ఏం లాభం! పోయిన సొమ్ము రాదుగదా — ఆ బెడ్డింగు కూడా ఎక్కడ పారేశొచ్చారో చెప్పండి — ఊరికే దాచక. దాన్నికూడా ఒక ఏడ్పు ఏడ్చి ఊరుకొంటాను."

"అప్పుడే తొందరపడవలసిన అవసరం లేదు. పోయిందని గట్టిగా ఇంకా చెప్పలేను. ఆసంగతి గట్టిగా తెలిసినతరువాత ఇద్దరం కలిసి ఆకాస్త్రపనీ చేద్దాము."

"చాల్లెండి. ఊరుకోండి. మీకు చీమకుట్టినట్లయినా లేదు, పైగా వేళాకోళం ఏమిటండీ!! ఆ బెడ్డింగు సంగతి ఏమైనా కనుక్కోండి."

"మన మేమి కనుక్కోగల్గుం? ఆయన ఎవరో నాకు తెలియనే లేదు. అయితేఒకటి - ఆయన చాలా పెద్ద మనిషి లాగు కనుపించాడు. తప్పక పంపుతాడు. వస్తుంది. నా మాట నమ్ము,"

"మీరు చెప్పిందల్లా నమ్మబట్టే ఈ స్థితికి వచ్చింది సంసారం —" అని కాంతం ఈసడింపుగా మాట్లాడి లేచిపోయింది. అవతల నుంచి మాటలు వినిపిస్తున్నాయి. "ఖద్దరు బట్టలు ఇన్ని వద్దండీ అంటే, అది వెయ్యి ఇదివెయ్యి అని వేధించారు. ఇప్పుడు మళ్ళీ కొనగలమా? ఈ ధరలలో ఎంత లేదన్నా యిరవై రూపాయల సొమ్ము!...ఆ శాలువ మటుకు శాలువ కొన్నప్పుడే పది హేనురూపాయలు. అంతా యాభై రూపాయల సొమ్ము. తగలేసి వచ్చారు."

"ఆయాభై న్నీ — ఆ వాక పాతిక - మరిచి పోయినావు."

"నాబొంద! పైగా జ్ఞాపకం చేస్తారు కూడా. డెభ్భై అయిదు రుపాయలు సొమ్ము పోయిందని ఏమన్నా - ఏం మనిషబ్బా! ..ఆపదు కాపదు పైపడ్డకొద్దీ ఎవరికైనా కాస్త జాగ్రత్త తెలుస్తుంది - నూరురూపాయల సొమ్ము! ఊహూ" అంటూ నిట్టూర్పులు విడుస్తూ కాంతం వంట ఇంట్లోకి వెళ్ళి పోయింది.

నేను ఒంటరిగా కూర్చుని ఆలోచించాను, ఆపెద్దమనిషి ఎవరై ఉంటాడా అని. సినిమాకథ నడుపుతూ పూర్వవృత్తాంతాన్ని దర్శకుడు చూపేరీతిగా జరిగిన ప్రయాణపు కథఅంతా ఒకసారి కళ్లముందుకు తెచ్చుకున్నాను. ఆయన నాకు ప్రథమంలో నిడదవోలు స్టేషనులో కనిపించాడు—ఎల్లాంటి మనిషి? చామనచాయ— వెడల్పైన నుదురు— బట్టతల— ఆయనను మళ్ళీ గుర్తించటానికి ఇవన్నీ సాయపడతాయి కదా అని సంతోషించి మరిచిపోకుండా ఉంటానికి కాయితంమీద వ్రాసుకొన్నాను. ఆయనను గురించి నాకు ఎటువంటి అభిప్రాయం కలిగిందీ అని రెండోప్రశ్న వేసుకున్నాను. నాకళ్లముందు ఆయన పర్ ఫెక్ట్ జెంటిల్ మెన్‌లాగ కనుపించాడు. నామనస్సును ఎన్నిసార్లు గుచ్చిగుచ్చి అడిగినా అదే సమాధానం వచ్చింది. దాంతో నాకు మరీ ధైర్యం వచ్చింది. పరుపుచుట్ట తప్పక వస్తుందని. మూడోప్రశ్న—ఆయన ఎవరై ఉంటాడు? ఈప్రశ్నకు సరియైన సమాధానం రాలేదు. మొదట నాకు ఆయన నావిద్యార్థులలో ఒకడై ఉంటాడని తోచింది. విద్యార్థి అని ఎందు కనుకున్నానూ అంటే — ఆ తరువాత నన్ను మాస్టారూ అని పిలిచాడు కాబట్టి. అయితే దానిమీద రెండు సందేహాలు బయలుదేరినై. మాస్టారూ అని పిలిచినంత మాత్రన నావిద్యార్థి అనుకుంటానికి వీల్లేదు. ఇప్పుడు మాస్టారూ అని ప్రతీవాడ్ని పిలుస్తారు. రెండోది - ఆయన నా విద్యార్థి అయితే నాకు నమస్కారం పెట్టడా అని కొందరు

విద్యార్థులు నమస్కారం పెట్టకుండా పోవటం కద్దుగాని అది ఉన్న ఊళ్ళో సంగతి. ఇన్నాళ్ళబట్టీ చూస్తున్నాను, పొరుగూరులో నావిద్యార్థి కనపడితే నమస్కారం పెట్టక పోయింది లేదు. చివరకు నాకు ఆయన నావిద్యార్థి కాదనీ, ఏదో ఆఫీసులో పనిచేస్తున్న ఉద్యోగి అనీ తోచింది. చివ్వరకు వచ్చింది ఆయనది ఏవ్వూరై ఉంటుందీ అన్నప్రశ్న. బెజవాడ, తెనాలి, గుంటూరు ఈ మూడుఊళ్ళల్లోనూ నన్ను బాగా ఎరిగున్న వాళ్ళు చాలామంది ఉన్నారు. కాబట్టి ఈ మూడుగ్రామాల లోను ఎక్కడో ఒకచోట ఆయనను కలుసుకోవచ్చునూ అని తోచింది. చాలా సంతోషం కలిగింది. పొరుగూరైతే, నేను ఈవూళ్ళో ఉన్నాననీ, ఫలానివీధిలో ఉన్నాననీ తెలియకపోవచ్చు. ఆపెద్దమనిషికి ఏ దురుద్దేశం లేకపోయినా, యీభోగట్టా తెలియక పంపలేకపోవచ్చు. కాబట్టి ఈసంగతీ, నా అడ్రెస్సూ ఒక చిన్న ప్రకటనరూపంగా పత్రికలో వేయిస్తే తప్పకుండా లాభిస్తుందని నిశ్చయించుకొని చటుక్కున లేచి వెళ్ళి, కాంతంతో చెప్పాను. ఆవిడ "ఊరికే వేస్తారా, ఏమైనా డబ్బు ఇవ్వాలా?" అంది. సుమారు ఓ అయిదారు రూపాయలు కర్చు అని చెప్పాను. ఆవిడ "చాల్లెండి. పైగా అదో దండగ ఎందుకు? ఇయ్యదలుచుకొన్నవాడు ఫల్లాగో కనుక్కొని ఇస్తాడు" అంది.

"ఏగుంటూరో అనుకో ఆయనది. ఆయన గుంటూరు నుంచి పనివేళా ఈపరుపు తీసుకొని నాలుగురూపాయలు కర్చు

చేసుకొని బందరువచ్చి ఆ పరుసు నా కిచ్చి వెడతాడా ?"
అన్నాను.

"మీదంతా వెర్రిగోల. ఇక్కడికి రావాలా అండీ, మీకు ఉత్తరం వ్రాయకూడదూ ? మీఅడ్రసు అసలు ఆయనకు తెలిసే ఉంటుంది. అంతగా తెలియకపోతే ఏ వెర్రివెధవను అడిగినా చెబుతాడు" అన్నది.

"వెర్రి వెధవలు గుంటూరులో ఉన్నారంటావా ?"

"ఆ. అన్ని ఊళ్లల్లోనూ ఉంటారు !"

"సరే. అయితే ప్రకటన చేయవద్దంటావు ?"

"వద్దు, ఏమీ వద్దు, ఊరుకోండి. ఇప్పటికి రెండు రోజులైందిగదా. ఇంకా రెండు రోజులు చూద్దాము. వస్తుందా, సరేసరి. రాదూ, పర్సు పోయినట్లే ఇదీ పోయిం దను కొంటాను." అని ఆవిడకు తోచిన హితవు చెప్పింది. చెప్పి "మీదోగోల. పరుసుచుట్ట వస్తుందన్నమాట నట్టిభ్రమ." అని తేల్చి చెప్పేసింది చచ్చులేకుండా.

"నాకుమటుకు పరుసుచుట్ట వస్తుందని ఘట్టి నమ్మకం" అన్నాను. చూద్దాంగా అని ఊరుకొంది కాంతం.

ఆతరువాత నేను బట్టలు వేసుకొని బజారు కెళ్లాను కాఫీ త్రాగటానికి. వీథిలో నడుస్తున్నా, కాఫీహోటల్లో కాఫీ త్రాగుతున్నా నాకళ్ళు నాలుగువైపులా తిరుగుతున్నై , [illegible] పెద్దమనిషి ఎవ్వరైనా కనిపిస్తారేమోనని. కళ్లు పీ[illegible] [illegible]ట్లు చూచినా ఒక జట్టుశాలా కనపడలేదు. కుండుచుట్టూ

తిరిగాను మున్నూర్చారు. ప్రయోజనం లేకపోయింది. ఒక్క బట్టతల మనిషి కనిపిస్తే బాగుండు ననిపించింది.

ఇంతలో ప్రొద్దు గ్రుంకింది. ఇక లాభంలేదని ఇంటికి కెళ్ళాను... ఆరాత్రి రాత్రల్లా కాంతం కాసేపు యాభై రూపాయలసొమ్ము పోయిందనీ, కాసేపు వందరూపాయల సొమ్ము పోయిందనీ గోలపెడుతూనే ఉంది.

తెల్లవారింది. పిల్లలంతా లేచారు. కాంతం కాఫీ కాస్తున్నది. ఆమెముఖంలో వెదికిచూచినా సంతోషరేఖలు లేవు. ఇంతలో వాకిట్లో ఆడుకొంటున్న పిల్లలు గొల్లున కేకేశారు పెంకులు లేచిపోయేటట్లు. ఏమిటా అని హడలిపోయి కాంతం ఒక్క గంతేసింది వీథిగుమ్మంలోకి. నేనూ వెనకాలే పరుగెత్తాను. ఏముంది? పరుపుచుట్ట ఒకటి పడేసుంది అక్కడ. ఉప్పరి "బాబూ, కూలి ఆరే ఇచ్చారండి. ఇదిగోనండి చీటీ" అని ఇచ్చింది. పరుపుచుట్టనాదే! ఆచీటీలో ఏమీలేదు. నా పేరు, వీథిపేరూ ఉంది – అంతే.

"ఎవరిచ్చారే ఇది" అని అడిగాను నేను. "ఆయన ఎవరో నే నెరగనండి. ఈపరుపుచుట్ట కార్లకాడ నాకిచ్చి మీఇంటికాడ ఇయ్యమన్నారండి. ఆచీటీ ప్రకారం మీఇల్లు కనుక్కున్నానండి." అని అది వెళ్ళిపోతుంటే – "ఆయన ఎట్లా ఉంటాడే ఉప్పరీ? ఆయనకు బట్టతల ఉందా" అని అడిగాను. "నాకు తెల్దండీ" అని కేకేసి అది గబగబ వెళ్లిపోయింది.

మేము మొదట కాసేపు తెల్లపోయి, తేరుకుని సంతో

షించాము. నిజంగా పోయిన వస్తువ దొరికినప్పుడు ఉన్న ఆనందం మహాగొప్పది. "నే జెప్పలేదూ కాంతం, ఎక్కడికీ పోదు - వస్తుందనీ" అన్నాను నేను గర్వంగా. "ఎవరో ఆయన పెద్దమనిషే." అని మెచ్చుకొంది కాంతం. "ఇంతకూ ఆయన ఎవరైనదీ తెలీయలేదుగదా" అన్నాను. "ఏదోతమాషాగానే ఉంది. ఈ కాలంలో యాభై రూపాయల సొమ్ము దొరికితే వద్దని ఇచ్చేసేవాడు ఉన్నాడండీ. పెద్దమనిషి. అయితేమటుకు నాకు మాత్రము నమ్మకం కలగటం లేదండీ" అని అని, ఏదో మనస్సుకు హఠాత్తుగా తట్టినదానిలాగ ఉలిక్కిపడి - "నన్ను తమాషాచేయటానికి ఏదైనా నాటకం ఆడారా" అన్నది.

"ఛా, ఏం నాటకం?"

"ఏముందీ - యిది ఈవూళ్లోనే ఎవరింటిలోనో పెట్టి రెండు రోజు లైనాక పంపమనిచెప్పి ఉండకూడదూ."

"ఛాఛా, ఎందుకూ అల్లా చెయ్యటం? అల్లాచేస్తేనాకేం ఒరుగుతుందీ?"

"ఊఁ, న న్నేడిపించడానికీ."

"ఎబ్బే... నేనుమటుకు లోపల ఎంత ఇదౌతున్నాను. ఇంతసొమ్ము పోయిందే అని - పైకి అల్లా ఉన్నానుగాని."

"కాదులెండి. మీరు మొట్టమొదటినుంచి చెప్తూనే ఉన్నారూ - బెడ్డింగు వస్తుంది. బెడ్డింగు వస్తుందీ అని. ఏమిటా ఇల్లా అంటారూ అని నేను సందేహిస్తూనేఉన్నా. దొంగనాటకం ఆడారన్నమాట" అన్నది.

"ఇదేంమాట కాంతం, నన్ను అల్లాగ అన్యాయంగా అంటావు. ఛీ! అల్లాగ ఎప్పటికీ చెయ్యలేదు. ఆయనకు నేను ఫలానా అని తెలిసిఉంటుంది. పంపాడు" అని సిన్సియర్ గా చెప్పాను. కాంతం నమ్మీనమ్మని స్థితిలో ఉంది.

ఇంతలో చిన్నపిల్ల బెడ్డింగు విప్పుతున్నది. విప్పి ఆబట్టలన్నీ అటూ ఇటూ పడేస్తుందని "అమ్మా, ఇప్పుడు అది విప్పక ఆనెక్క చూద్దాం" అన్నాను.

"విప్పనియ్యండి. బట్టలన్నీ ఉన్నయ్యేమో చూద్దాము" అన్నారు ఆవిడ. అందులో ఏమైనా తినే వస్తువ ఉందేమోనని వాళ్లు చూస్తున్నారు. అమ్మకూడా విప్పమనటం మూలాన వాళ్లునలుగురూ చేరి, "వద్దే తల్లీ, ఇప్పుడెందుకే" అంటూనే ఉన్నా వినక తాళ్లూ అవీ దేనికవి ఊడదీశేశారు. అందులో ఒకమిఠాయిపొట్లం ఉంటే చిన్నపిల్ల లిద్దరూ డేగల్లాగ తన్నుకుపోయారు. ఈపొట్లం ఎక్కడిదా, నే నటువంటి దేమీ పెట్ట లేదే అని ఆలోచిస్తున్నాను. మరచిపోయి పెట్టటానికైనా వీలులేదు. ఎందుకంటే నేనసలు ఎక్కడా కొన్నపాపాన పోలేదు.

ఇంతలో చిన్నమ్మాయి, "యిదెక్కడిది నాన్నా? అక్కయ్యకు కొన్నావా" అంటూ ఒక చీర పైకి ఎత్తింది. "పట్టు రెవిక యిదిగోనే అమ్మా" అని పాప రెవికను పరుపుచుట్టలో నుంచి పైకి లాగింది.

నేను ఏమి టీ విచిత్రం అంటూ తెల్లపోయి చూస్తున్నాను.

ఆవిడ ముఖం ఎందుచేతనో కందగడ్డ అయిపోతున్నది. "మిగతా బట్టలు చూపు" అన్నది చిన్నదాంతో. అది ఒక్కొక్కటే ఎత్తి చూసింది. అన్నీ నాబట్టలే! అన్నీ ఉన్నాయి!

కాంతం ఏమనుమానపడ్డదో ఏమో మరి నిప్పులు గ్రక్కుతూ తోకత్రొక్కిన పాములాగ చివ్వున లేచి "ఏమిటండీ? — చీర ఎవరిదండీ? ఎట్లా వచ్చింది ఇది మీపరుపుచుట్టలోకి? మాట్లాడరేం?" అంటూ చురచురా చూసింది. నేను ఏమీ చెప్పలేక కళ్లు అప్పగించి ఊరుకొన్నాను.

కాంతం కత్తులూ, కటారులూ చూపుల్లో విసరుతూ "ఇంత నాటకం ఆడతారుటండీ-నన్ను పిచ్చిదాన్ని చేసి!" అని కొర కొర చూచింది.

"ఇదేమిటో చిత్రంగానే ఉంది" అన్నాను నేను.

"చిత్రంగా ఉండదూ! ఎట్లా వచ్చింది ఇది మీబెడ్డింగు లోకి?" అని అడిగింది ఆవిడగారు.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను" అన్నాను.

"ఆలోచిస్తారు! ఆలోచించరూ మరి! నంగనాచిలాగ చూడబోకండి. ఏమిటో అసలుసంగతి చెప్పండి" అన్నది. నేనేమీ చెప్పలేకపోయినాను. కాంతం నన్ను అనుమానిస్తున్న దని నేను గ్రహించాను. కాని ఏమి చెప్పినా నమ్మించలేను. అందుకని "రామ, రామ? నేనేమీ ఎరగను" అని ఇంత అపనింద పైబడ్డందుకు సిగ్గుపడి దిగులుతో లోపలికి వెళ్ళి పోయి పరుపుమీద బోర్లబోక్లా పడుకొన్నాను. రెండు

నిమిషాలైందో లేదో ఎవరో వీధిగుమ్మంలోకి వచ్చినట్లు చప్పుడైంది. "మాస్టరుగారుఉన్నారాండి" అన్నారు ఎవరో. "ఆ, ఉన్నా" రన్నది కాంతం. "మరేమీ లేదండీ. యిదిగో యిక్కడే ఉందే ఈపరుపుచుట్ట! నాకు కైకలూరుస్టేషనులో మాస్టారు ఈపరుపుచుట్ట యిచ్చి ఆయన దిగబడిపోయినారు. నేను గుడివాడలో దిగానులెండి. దిగి మా అమ్మాయిగారింట్లో రెండురోజులుండి యివ్వాళే అమ్మాయిని వెంటబెట్టుకొని వచ్చాను కారుమీద. ఈ పరుపుచుట్ట నాదే అనుకొని యిందులో చీర ఒకటి పెట్టిందట మా అమ్మాయి. యిప్పుడే చెప్పింది. తీసుకెడదా మని వచ్చానండి" అన్నాడు ఆవచ్చిన పెద్దమనిషి.

"ఇదుగోనండి మీచీర. ఎక్కడిదా అని నేనూ చూస్తున్నాను. ఇవ్వవే అమ్మాయి" అని కాంతం అనటం వినిపించింది. "నాన్నను పిలు అమ్మా" అని కూడా అన్నది. అమ్మాయి వచ్చి నన్ను పిలిచింది. నేను వెళ్లి ఆయన్ను గుర్తించి పరుపు చుట్ట జాగ్రత్తగా పంపినందుకు నమస్కరించాను. ఆయన "మాస్టారూ, క్షమించాలండీ. పాపం ఈ రెండు రోజులూ మీరు పరుపుచుట్టకోసం ఆదుర్దా పడిఉండాలె!" అన్నాడు. నేను "ఏమీ ఆదుర్దాపడ లేదండి. ఎక్కడికి పోతుంది" అన్నాను. "గుడివాడలో మాఅమ్మాయిగారింటికి వెళ్లాను. అక్కడ రెండు రోజు లుండాల్సి వచ్చింది" అంటూ మళ్లీ నాకు ఆకథ అంతా చెప్పి సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయినాడు.

నన్ను కాంతం అనవసరంగా అనుమానించినందుకు నాకు వళ్లు మండిపోతున్నది. అంచుచేత నేను ఆమెవైపు అన్నా చూడకుండా గబగబా వెళ్లిపోయి మళ్లీ ప్రక్కమీద పడు కొన్నాను. పదినిమిషాలు గడిచింది. గాజుల చప్పుడైంది. నేను గిరుక్కున అటుతిరిగాను. ఆవిడ వచ్చి ప్రేమ వుట్టిపడే కంఠంతో "కాఫీ యిస్తాను రండి" అంది. నేను మాట్లాడలేదు. ఆమె వంకైనా చూడలేదు. ఆమె నాబుజాలు పట్టుకొని తిప్ప టానికి ప్రయత్నిస్తూ "రండీ! పిల్లలుకూడా కాఫీ త్రాగకుండా కూర్చున్నారు మీకోసం" అన్నది. "నన్ను అన్యాయంగా అనుమానించావుగా నీవు" అన్నాను నేను రుద్ధకంఠంతో. అని పసిపిల్లవాడిలాగ ముసుగుకొని పడుకొన్నాను. నాచెక్కిళ్లు నొక్కుతూ "మనస్సు పాపిష్టిదండి. ఆడదాని మనస్సు వట్టి పాపిష్టిది. ఏమిటో వెధవ ఆడపుటక!" అంటూ కాఫీ కప్పు నాకు అందించింది మాకాంతం.

## మా చిట్టి తల్లి

మా విజయకు ఆరేండ్లు వెళ్ళినాయి. మా అమ్మాయి అని అనటంకాదు గాని అది చక్కనిపిల్ల. కోటేరుపోసినట్లు ముక్కూ, చెంపకు చారెడేసి కళ్ళూ, నీటి బుడగల్లాంటి బుగ్గలూ, అదీ, జాతిబొమ్మలాగుంటుంది! దాని తరువాత పిల్లలు లేకపోవటంమూలాన అది ఆడింది ఆటా, పాడింది పాటా మాఇంట్లో. ఒకవిధంగా దానికి అందరమూ దడుస్తా

ఉంటామకూడాను. దానికి కాస్త చిన్నదెబ్బ తగిలిందా అంతే ఇక ఇంటిల్లిపాదీ దానిచుట్టూ చేరి, "మాఅమ్మ! ఎంతపెద్ద దెబ్బ తగిలిందే తల్లికి! అబ్బా! ఎంతదెబ్బతగిలిందే అమ్మకూ" అంటూ భజనచేయాలె. ఎవరన్నా, అదేమంత పెద్దదెబ్బ కాదు అన్న భావంతో నవ్వినా, దాన్ని ఓదార్చకపోయినా విజయవాళ్ళమీద పడి రక్కి, ఏడ్చి నానాగోల చేస్తుంది. పెద్ద బాధకలిగినా గొప్పఓర్పుతోనూ, ధైర్యంతోనూ, అది భరిస్తున్నదని మనం అనుకోవాలె. అదీ అల్లాగే అనుకొంటుంది. దాని స్వభావం అల్లాంటిది.

కష్టాలలోనే కాకుండా సుఖాలలోనూ అంతే. అది మొగ పిల్లలతో కలసి గోడీబిళ్ళ ఆడుతుంది. ఆసమయంలో అది బిళ్ళను పట్టుకొన్నదా అందరూ చప్పట్లు చరిచి, అరిచి దాన్ని గొప్పచేసి మెచ్చుకోవాలె. అల్లాగ చెయ్యక పోయినారో వెంటనే కర్ర బిళ్ళా అక్కడ పారేసి వాళ్ళమ్మను కౌగలించుకొని ఏడుస్తుంది. దానికి వచ్చిన కష్టం గొప్పకష్టం! దానికొచ్చిన జయం అఖండవిజయం!!

ఒకరోజున నేను నిద్ర లేవకముందే విజయ వచ్చి నన్ను లేపి "చూడు నాన్నా, ఒళ్ళంతా ఎట్లా ఐందో" అన్నది బిక్కముఖంతో, జాలిగా నావంక చూస్తూ. నేను కళ్ళు నలుపుకొని చూశాను. వంటినిండా సందులేకుండా దద్దుర్లు పోసినై. తెల్లనిశరీరంపైని ఎర్రగా ఉన్న ఆ దద్దుర్లను చూసేసరికి నాకూ కొంచెం భయంవేసింది ఏమిటా ఇది అని.

ఒకొక్క దద్దురు ఎత్తుగా ఉబ్బి విచ్చిన గులాబిపూవు అంత ఉందీ. వాళ్ళ అమ్మను పిలిచి చూపాను. "ఇవేమిటండీ ఇల్లా పోసినై దద్దుర్లు? ఇదేమైనా అమ్మవారా" అన్నది అవిడ. "అమ్మవారు అయితే ఇల్లా ఉండదు" అన్నాను నేను. ఆవిడా చాలాభయపడ్డది. ఇంతలోకే పిల్లలంతా వచ్చారు. వచ్చి దానిచుట్టూ మూగి, "ఎంతపెద్ద దద్దుర్లే! ఎర్రగా ఉన్నయి ఏమిటే? ఏమన్నా మంటా అమ్మా? దురద ఏమన్నా ఉందిటే" అని ప్రశ్నలు వేయసాగారు. అది ఒకొక్క ప్రశ్నకే సమాధానం ఇస్తున్నది. ఎంతో ఓర్పూ, ధైర్యమూ గలదానివలె నటిస్తూ అది మాట్లాడుతున్నది.

"ఎంత పెద్ద దద్దుర్లే!"

"ఇందాక ఇంకా పెద్దవిగా ఉన్నాయే. ఇప్పుడు కాస్త నయం. ఇంకా నాన్న నడుగూ. ఏం నాన్నా?"

"ఇందాకా ఒక్కొక్క దద్దురు ఇంతింత ఉందమ్మా" అన్నా నేను.

"అయ్యొ బాబో" అన్నారు అంతా.

"ఎర్రగా ఉన్నాయి ఏమిటే" అన్నాడు అబ్బాయి.

"ఇదేమి ఎరుపే! ఇందాకా నీవు చూడలేదు మందార పూల్లాగ ఎర్రగా ఉన్నాయి. కాదుటే, అమ్మా?"

"అవునమ్మా, నాతల్లీ. ఇదేం కర్మమే! ఏమన్నా మంటగా ఉందా అమ్మా?"

"అబ్బో! కారంపూసినట్లు భగభగ మండుతున్నదే అమ్మా"

"నాతల్లీ, ఇదెక్కడి విపరీతమే! ఇల్లాంటిది నే నెప్పుడూ ఎరగనూ! దురదకూడా ఉన్నదా అమ్మా?"

"అబ్బ! తగనిదురద. గోకితే పుండు అవుతుందని ఊరు కొంటున్నాను" అన్నది విజయ ఒక్కక్షణం ఆలోచించి.

"అమ్మతల్లీ! ఎంత బాధపడుతున్నావే" అన్నారు అంతా.

ఇంతలో మాఇంటి ప్రక్కనున్న ముసలమ్మగారొచ్చి "ఏమిటర్రా" అంది. "బామ్మగారూ, ఇల్లా రండి, పిల్లను చూడండి" అన్నది మా ఆవిడ. ఆవిడా ఒక నిమిషం చూచి

"ఎప్పటినుంచి అమ్మా ఇల్లాగా?"

"ఏమోనండీ, ప్రొద్దున్నే అదే వచ్చి వాళ్ళనాన్నకు చూపిందాకా మా కెవ్వరికీ ఏమీ తెలియనే తెలియదు. ఏమండీ బామ్మగారూ, ఇవి ఏమిటి అంటారు?"

"ఇవి దద్దుర్లే అమ్మాయి"

"అవునులెండి. ఎందు కొచ్చినట్లు? ఏంచేయమంటారు?"

"ఏం ఫరవాలేదమ్మా"

"మీకేం, అలాగే అంటారు" అన్నది మా విజయ కొంచెంకోపంగా. ఆవిడకూ మావిజయ తత్వం తెలుసు. అందు కని చప్పున మళ్ళీ అన్నది:

"అవునమ్మా, పాపం, నీవు బాధపడుతున్నావు తల్లీ. ఏం జేస్తామమ్మా! వీటి దుంపతెగ! ఇవి ఒక్కతీరాన పోవు. పాపిష్టివి! దురద ఉండదు కాని మంట మాత్రం బాగా ఉంటుంది."

"అవునండి బొమ్మగారూ. దురదన్నమాట లేదుగాని మంటగా ఉందండి. వళ్ళుఅంతా" అన్నది మావిజయ.

"ఏదైనా కుటితే ఇలాగు వచ్చిందో, లేకపోతే ఏదైనా గాలిచేష్ట ఏమైనా సోకిందో" అని మా ఆవిడ భయపడి పక్కఇంటివాళ్ళకు నలుగురికీ కబురంపింది. ఒకావిడ వచ్చి "చింతపండుపులుసు పట్టిస్తే ఆదద్దుర్లు మాయమవుతాయి" అన్నది. ఈమాట విజయకు కష్టం కలిగించింది. "ఏమిటి నాన్నా. వెధవ చింతపండుతో నయమవుతాయాఇవి? మంచి డాక్టరును తీసుకొని రావాలె గాని" అన్నది, ఎంతో చిన్న బుచ్చుకొని. ఆదద్దుర్లు చింతపండు పులుసుతో నయం అయ్యే టంతటి స్వల్పవిషయంగా పరిగణించటం దానికి సుతరామూ ఇష్టంలేదు.

ఇంతలోనే ఇంకోఆవిడ వచ్చి, "మంట ఉంటే చింతపండు పులుసైనా, నిమ్మకాయ రసమైనా పూస్తే ఇట్టే అణిగిపోతై. మంట గనక లేకపోయినా ఇవి కొంచెం ప్రమాదమే" అన్నది.

"మంట ఉంటేనేనయమూఅంటే? అయితే మంటఉందనే అంటున్నదండీ పిల్ల" అన్నది మా ఆవిడ.

"మంట లేదే! మంటాలేదు దురదాలేదు" అన్నది మా చిట్టితల్లి.

"ఇందాకా భగభగ మండుతున్నది. తగనిదురద అంటివి గదే?" అన్నాను నేను.

"మంటగా ఉందనుకున్నా నాన్నా" అన్నది విజయతల్లి తెల్లపోయి.

"మీరూరుకోండి, చిన్నపిల్ల కేం తెలుస్తుంది" అని మా ఆవిడ నన్ను కోప్పడు తున్నట్టు నటిస్తూ, అది చూడకుండా నావైపు తిరిగి నవ్వింది.

నేను తెలివితక్కువగా పైకే నవ్వాను. చిట్టితల్లికి కోపం వచ్చి, "నాకు జబ్బుగా ఉంటే మీకు నవ్వులాటగా ఉందేం?" అని అంటూ మూతి మూరెడుపొడుగు చేసుకొంది. అది ఇక ఏడ్పు మొదలుపెడుతుందని కనిపెట్టి మాఆవిడ "చాల్లే ఊరుకోండి. మీకు అభం తెలియదు, శుభం తెలియదు. అవతల దాని వొళ్లుఅంతా కందగడ్డ అయిపోయి ఉంటే చూస్తూ ఊరుకోవడమే గాకుండా పైగా నవ్వుతున్నారూ! బాగానేఉంది లక్షణం. ఇప్పుడైనా పట్టుకెళ్లండి డాక్టరు దగ్గరకు" అన్నది విసుగ్గా.

"వెళ్తానే. దానిబాధ ఏమిటో తెలియాలా ?"

"ఏమిటి తెలిసేది? కనపడటంలేదు ?"

"అదికాదు నేననటం. దానికి దురదా, మంటా ఉన్నట్లా, లేనట్లా ఇంతకూ" అని పసిదానివంక చూశాను. చిట్టికూడా ఏమీసమాధానం చెప్పలేక బిక్కముఖంతో బాధపడుతున్న దానిలాగ తలొంచుకొని ఊరుకొన్నది.

"ఏం, అమ్మా! ఏమిటీబాధా ?" అని అడిగాను.

"ఏమిటో నాన్నా! నాకేం తెలియటం లేదు. వికారంగా ఉంది నాన్నా" అన్నది.

"పైత్యాన వచ్చిందేమో సుమా, వికారంగా ఉందని

అంటూ ఉన్నది ” అన్నాను.

వట్టి మామూలు పైత్యంవల్ల వచ్చిన దద్దుర్లే అని నేను అనుకొంటే దానికి చాలా కష్టంగా ఉంటుందని కాంతానికి తెలుసు. అందుకని ఆవిడ “ పైత్యమనీ, వికారమనీ మీరు ఊరికే నీళ్లు నములుతూ కూర్చోక పరుగెత్తండి డాక్టరుదగ్గరకు. పిల్ల బొత్తిగా కూరాకు అయిపోతుంటేనే ” అన్నది.

ఇంతలో చిట్టి నిజంగా నీరసం కలిగినదానికిమల్లె చాప మీద వాలి కళ్లు మూసుకొంది. నాకు నవ్వొవస్తున్నది. మాఆవిడ పళ్లుబిగించి ముఖం విసురుగా తిప్పింది, నవ్వొవద్దు. అని సూచనగా.

“ సరేలేవే. అమ్మాయీ! డాక్టరు దగ్గరకు వెడుతున్నాను. చూడమ్మా, కాంతం, దాన్ని ఆచాపమీదనుంచి తీసికెళ్ళి మేడ పైన మంచంమీద పడుకోపెట్టు. ముఖం కడుక్కున్నదిగా. కాస్త కాఫీ ఇయ్యి ముందు. ” అని చెప్పి నేను క్రిందికి దిగటం మొదలు పెట్టాను.

నేను వెళ్లిపోతుంటే నన్ను ఒకసారి పిలిచి మాఆవిడ “ మీరు బజారులో కాఫీ త్రాగుతూ కాలం గడపక వేగిరం డాక్టరును తీసుకురండి ” అని గట్టిగా చెప్పింది. సరేనని నేను వెళ్లబోతుంటే అమ్మాయి “ నాన్నా ” అని పిలిచింది. “ అమ్మాయి ఏమిటో చెప్తున్నది. వినిపొండి ” అని ఆమె కూడా అన్నది.

“ ఏమిటమ్మా ” అన్నాను.

"ఎవరిని తీసికొస్తావునాన్నా" అని నీరసంగా అంది విజయ. అప్పుడే దానికి నీరసం కూడా వచ్చేసింది.

"చలపతిరావుగారిని తీసుకొస్తానమ్మా" అన్నాను. చలపతిరావుగారి మీద మా ఇంటిల్లిపాదికీ విశ్వాసం. ఆయన చాలా నెమ్మదైనవాడూ, చాలా సమర్థుడూ కూడాను. అయితే ఆరోజున మాఅమ్మాయి "ఎప్పుడూ ఆయనేనా నాన్నా" అన్నది. మామూలు జబ్బులకు వచ్చే డాక్టరుగారు తనకు ఇప్పుడు పనికిరాదని దానిఉద్దేశం. ప్రత్యేకమైన క్రొత్త డాక్టరు వస్తేనేగాని దానికి తృప్తి లేదన్న సంగతి వాళ్ళతల్లి వెంటనే గ్రహించి "చూడండి, ఆవీధిలోకి జోసిఫ్ అని ఒక క్రొత్త డాక్టరు వచ్చాడు. కారులో తిరుగుతుంటాడు, ఎరగరండీ ? ఆయన్ను పిలుచుకురండి" అన్నది.

"అబ్బో ? ఆయన మనబోటివాళ్ళ ఇండ్లకు వస్తాడు టే ?"

"ఎట్లాగో బ్రతిమిలాడి తీసుకురండి. ఏంత అడిగితే అంతా ఇస్తా ననండి. రాకేంజేస్తాడు ? ఇటువంటి సమయంలో మనము డబ్బుకోసం చూచుకొంటే ఎట్లా ? తప్పుతుందా ? వెళ్ళండి వేగిరం" అని మాపిల్లలతల్లి అన్నది. ఈ మాటలు వింటున్న విజయతల్లి ముఖం చేటంత అయింది.

౨

"ఎందుకైనా మంచిది క్రొత్త డాక్టరుతో పరిచయం కలుగజేసికొనటం. పిల్లలు గలవాళ్లం మనము" అంటూ ప్రక్కవీధి

లోకి వెళ్లాను. వెళ్లి తలుపునెట్టి "జోసిఫ్‌గారు ఉన్నారా" అని అడిగాను.

"ఆ!" అంటూ ఒకాయన తలుపు తీశాడు. పొడుగాటి మనిషి. బిళ్లగోచీ పెట్టి, బెంగాలీ పద్ధతిలో పంచకట్టాడు. తెల్లని శరీరం. గడ్డం మాత్రం దుబ్బుగా పెరిగివున్నది. మనిషి చూపులకు దర్జాగా ఉన్నాడు. కళ్లుమాత్రం పెద్దవిగా ఉండటమే కాకుండా ఏదో తమాషాగా ఉన్నాయి. బెంగాలీలాల్చీ తొడుక్కున్నాడు.

"జోసిఫ్‌గారి కోసం వచ్చానండీ" అన్నాను.

"ఆ, నేనే. ఏం కావాల చెప్పండి" అన్నాడు ఆయన.

"తమ రేనాండి? తమ దర్శనం నేను ఎప్పుడూ చేయలేదు" అన్నాను.

ఆయన తల ఊపి, గడ్డంలోకి నాలుగు వేళ్లూ పోనిచ్చి దువ్వి 'ఆ' అని దగ్గాడు.

నేను మళ్లీ అన్నాను, "తమరు ఒక్కసారి మాఇంటికి దయ చెయ్యాలె. పిల్లదానికి అస్వస్థతగా ఉంది" అని.

"అల్లాగా? ఇప్పుడే వస్తాను" అని బల్లపైనున్న స్టెత స్కోపు తీసుకొని ఆయన బయటకు వచ్చాడు.

"బండి తెమ్మంటారా" అన్నాను.

"వద్దు వద్దు. నడవటమే నాకు అలవాటు. దక్షిణ ఆఫ్రికాలో నేనున్నపుడు రోజుకు వంద మైళ్లు నడిచేవాణ్ణి" అన్నాడు.

వందమైళ్ళు ఎల్లాగ సాధ్యమా అని సందేహం తోచింది. కాని, ఎందుచేతో నేను ఆవిషయమై ఆయనతో వాదన పెట్టుకోక, ముందునడిచి దారితీశాను. ఇంకో అయిదు నిమిషాలలో ఇల్లుచేరుకున్నాము. ఈ స్ఫురద్రూపిని చూచి మాచిట్టితల్లి కూడా సంతోషించింది.

"ఈబిడ్డకేనండి కులసాలేకపోవటం" అన్నాను.

"అల్లాగా! ఏం?"

"శరీరం చూడండి. వంటిమీద ఎర్రని మచ్చలు. దద్దుర్లు పోసినై" అన్నది మాఆవిడ.

"ఎల్లాగ వచ్చాయి ఇవి? ఇవి ఈదేశంలో లేవే! దక్షిణ ఆఫ్రికాలో పిల్లలకు తరుచు ఇల్లాంటి దద్దుర్లు పోస్తుంటాయి. ఈపిల్లకెల్లాగు వచ్చినై అబ్బా!" అని డాక్టరు ఆశ్చర్యపోయినాడు.

ఈయనకు దక్షిణ ఆఫ్రికా పిచ్చి చాలా ఉన్నట్లుందే అనిపించిది.

"ఏమోనండి. నిన్న ఏమీలేదు. తెల్లవారేసరికి శరీరం అంతా ఇల్లాగ అయిపోయింది. చూడండి, ఎర్రగా ఉబ్బి, ఎల్లాగున్నవో. భయంకరంగా ఉన్నాయండి" అన్నాను.

ఆయన దద్దుర్లను చక్కగా పరీక్షించాడు. స్టెతస్కోపుతో గుండెదడ విన్నాడు. చూచిచూచి చివరకు ఆయన "ఎట్లా వచ్చిందండీ ఈజబ్బు మీఅమ్మాయికి?" అని అన్నాడు.

అనేటప్పటికి మాకు భయంవేసింది. అందుకని "ఇదేమైనా

ప్రమాదం చేస్తుందా అండీ” అని అడిగాను. “ప్రమాదం కాకేమండీ? ప్రమాదమే. మంటా, దురదా కూడా ఉన్నాయి కదూ?” అన్నాడు.

“ఆ” అన్నది అమ్మాయి భయంతో.

నేనూ, మా కాంతంకూడా ఆయన మాటలు విని బిక్క ముఖాలతో నుంచున్నాము. మాస్థితి చూచి చివరకు డాక్టరు గారు “చూడండి, మీరేం దిగులుపడాలిసిన అవసరం లేదు. మీ ఇంట్లో బూడిదరంగు కాయితం ఉందా?” అన్నాడు.

“ఆ, ఉందండీ” అన్నది మా ఆవిడ.

“బూడిదరంగుకాయితంతో ఈఅమ్మాయిశరీరం అంతా కప్పివేయండి. ఎక్కడా గాలిదూరే సందుఅయినా లేకుండా కప్పేసెయ్యండి. ఆకప్పినకాయితం ఎగిరిపోకుండా పైన దారం చుట్టండి. తెలిసిందా? పిల్లను కాయితంతో ఒకపొట్లంలాగ చుట్టివేయా లన్నమాట. అల్లాగ చుట్టి, పరుపుపైన పడుకో బెట్టి, పైన రగ్గు కప్పండి. ఒకగంటసేపు అల్లాగ ఉంచి దాని తరువాత కాయితం, రగ్గూ అన్నీ తీసెయ్యండి. చూడండి, అప్పుడు ఒక్కదద్దురైనా ఉంటే అనండి” అన్నాడు ఆడాక్టరు.

ఆమాటలు విని మాఆవిడ తెల్లపోయింది. నాకూ ఈవిధానం విచిత్రంగానే ఉంది. పైత్యాంతకమో, లేకపోతే ఆర్సెనిక్ తో కూడిన ఏదైనా మందో ఇల్లాంటి దద్దుర్లకు వాడటం కద్దుగాని ఇల్లాగ బూడిదరంగు కాయితంతో వైద్యం చేయట మనేది నాకూ క్రొత్తగానే ఉండి, ధైర్యంచేసి చివరకు

"బూడిదరంగు కాయితమా అండీ" అని సందేహాన్ని వెలిబుచ్చాను. ఆయనా నావంక చురచురా చూచి. "బూడిదరంగు కాయితంయొక్క మహాత్మ్యం నీకేం తెలుసు? నేను దక్షిణ ఆఫ్రికాలో ఉన్నరోజులలో రకరకాల జబ్బులకు, మొత్తం మీద 20 వేల గజాల బూడిదరంగు కాయితం ఉపయోగించాను. మరి నాఅనుభవమంతా మట్టిగలిసి పోయినట్లేనా? నేను చెప్పినట్లు చేయండి" అని గట్టిగా అనేసరికి మేమేమీ మాట్లాడటానికి వీలులేకపోయింది. కాని నే నూరుకోక "చిత్తం అల్లాగే చేస్తాము. అయితే...ఇది ఉమాపతీ వైద్యం... అలాంటి దేదైనా కొత్తరకం వైద్యమా అండీ" అన్నాను.

"ఏవిధానమైతే మీకెందుకూ? నేను చెప్పినట్లు చెయ్యండి. గంటా అంటే సరిగ్గా గంటలో అన్నీ మాయమౌతాయి."

"చిత్తం. ఇదేదో చిట్కావైద్యం అనుకుంటా" అన్నాను మళ్లీ నేను. మళ్ళీ ఇల్లాగ అనటం విని ఆయన విసుక్కొన్ని, "ఏవైద్యమైతే నీకెందుకయ్యా? దక్షిణకాఆఫ్రికాలో నేను ఇటువంటివి ఎన్నో నయంచేశాను." అని అంటూ వెనక్కు తిరిగాడు. పెద్దవాడు చెప్పుతుంటే వాదించకూడదని నాకూ తోచింది. అందుకని "క్షమించండి డాక్టరుగారూ! అల్లాగే చేస్తాము. అయితే పిల్లను సాంతం, ఒక పొట్లంలాగ బూడిదరంగు కాయితంలో చుట్టేయమంటారూ?" అన్నాను.

"ఆ."

"వేరే గాలేమీ తగలకూడ దన్నమాట!"

"ముక్కుకూ, నోరుకూ మటుకు కంతలు వదిలెయ్యాలి. సరిగ్గా అల్లాగ చెయ్యండి. బిడ్డవంటికి నొప్పిలేకుండా సన్నని దారం కాయితంపైన చుట్టండి."

"ఇంతఎందుకూ. మిఠాయిపొట్లంలాగ పిల్లను ఆకాయితంలో చుట్టేయమంటారందుకూ?"

"అవునయ్యా" అని ఆయన విసుక్కున్నాడు.

"అయితే డాక్టరుగారూ! ఇంతేనా ఇంకేమైనా మందు. ఇస్తారా?" అని అడిగాను.

"అవునవును. వేరే మందుకూడా ఇస్తాను. పిల్లను ఇల్లాగ పడుకోబెట్టి ఆసుపత్రికి రండి. మందు తయారుచేసి ఉంచుతాను. తెలిసిందా? వస్తాను."

అని ఆయన వెళ్లబోతుంటే నేను- "అయితే, సార్! ఇదేం జబ్బు అండీ? దీని పేరూ?" అన్నాను. కాంతం, అమ్మాయీ కూడా ఈజబ్బుకు ఏంపేరో తెలుసుకొందామని ఆదుర్దాగా ఉన్నారు.

"జబ్బుపేరు నీ కెందుకయ్యా? అయినా నీవు అడిగావు కాబట్టి చెబుతున్నాను. దీనిని ఇంగ్లీషులో ఇస్ సో- ఫాక్టో- గ్రానికో- క్రీమాగో-సాంగ్ టమ్-డామినిషో- కాలికో అంటారు" అని ఆయన గిరుక్కున వెళ్ళిపోతుంటే నేనూ వీధిగుమ్మం దాకావెళ్ళి సాగనంపి వచ్చాను.

మా అమ్మాయి అంత పెద్దపేరు విని ముఖం చేటంత చేసుకొంది. "నన్ను పొట్లంలాగ కడతారా నాన్నా" అని

అది చాలా సరదాపడటం మొదలుపెట్టింది. "ఇది వట్టి పిచ్చి వైద్యంలా గున్నదే" అన్నాను నేను కాంతం వంక తిరిగి.

"అల్లాగ అనకండి, చూద్దాం పోనీ. ఇందులో మన కొచ్చిన ఖర్చు ఏమీ లేదుగా" అంది కాంతం.

"లేకపోతేమటుకు ఏమిటీ పిచ్చిచేష్టలూ? బూడిదరంగు కాయితం కప్పటమేమిటీ?"

"అల్లాగ కొట్టేయకండి. అందులో ఏమి మహాత్యంఉందో చూద్దాంపోనీ" అన్నది ఆవిడ.

"సరే, కానియ్యి" అన్నాను నేను.

ఈవైద్యవిధానం పిల్లకుమటుకు బాగా తృప్తిగా ఉంది. అది హాలులో ఎగురుతూ, "అక్కయ్యా! నాజబ్బుపే రేమిటే? చాలా తమాషా అయిన పేరు చెప్పాడాయన, ఏమిటదీ? నాపైనా బూడిదరంగు కాయితం కప్పరేం!" అంటూన్నది.

"మన ఇంట్లో ఏమైనా అల్లాంటికాయితం ఉందా" అని నేను అడిగాను. కొద్దిగా ఉన్నట్లు తేలింది. అదిఒక కాలుకైనా సరిపోయ్యేట్లు లేదు. అందుకని బజారునుంచి ఒక అరవీసెడు కాయితం తెప్పించాను.

దానితరువాత ఆకాయితం దానిమీద కప్పాము. పిల్లలంతా సాయంచేశారు. ఒకరు కాయితం కాప్పారు, మరొకరు ఎగిరిపోకుండా పట్టుకొన్నారు, ఇంకొకరు దానికాళ్ళకూ, వేళ్ళకూ, చేతులకూ గుండ్రంగా దారాలుపోసి చుట్టారు. మాచిట్టితల్లి బుట్టబొమ్మలాగ తయారైంది. పిల్లలంతా దాని

చుట్టూ చేరి దాన్ని నవ్వించారు. ఇదంతా దానికో ఆటగా ఉంది.

"మీరంతా వెళ్లిపొం" డని పిల్లల నందరినీ క్రిందికి పంపేశాను. దాన్ని మంచంమీద పడుకోబెట్టి, దానికి తోడుగా పెద్దదాన్ని కూర్చోమని నేనుకూడా క్రిందికి వచ్చేశాను.

"మీరు సీసాపుచ్చుకొని డాక్టరుదగ్గరకు వెళ్ళండి" అని నన్ను తరిమింది మా ఆవిడ. సరే నని నేను సీసా తీసుకొని వెళ్ళక తప్పిందికాదు.

నేను వెళ్ళేసరికి ఆయన మందు తయారుచేసి సిద్ధంగా ఉంచాడు.

నేను వెళ్ళటంతోనే ఒక మందుసీసా నాకిచ్చి "ఇది తీసి కెళ్ళి ఇయ్యండి" అన్నాడు డాక్టరు. ఆసీసా ఒక పెద్దకూజా అంత ఉంది. "ఇంతమందు ఎందుకండీ" అన్నాను. "ఇదంతా ఇవ్వాల" అన్నాడు. ఆమాట వినేసరికి నాకు నిజంగా అను మానం గలిగింది — ఇది వైద్యమా, లేక మరేమన్నానా అని. "డోసు ఎంత అండీ" అన్నాను. "తాగినంత ఇయ్యండి" అన్నాడు. ఆమాటవల్ల నాకు అనుమానం ఇంకా ఎక్కు వైంది.

ఇంతలో మేడమెట్లుదిగి ఎవరో వచ్చారు.ఆయన పచ్చగా దబ్బపండులాంటి శరీరచ్ఛాయలో ఉన్నాడు. సూటు వేసు కొన్నాడు. అప్పుడే క్షవరం పూర్తిచేసికొని వచ్చాడేమో ముఖం నిగనిగలాడుతూ ఉన్నది.

ఆయనను చూచేసరికి ఈడాక్టరుగారు ముడుచుకొనిపోయి నాడు - మాస్టరును చూచి భయపడినకుర్రవాడిలాగ. ఆక్రొత్తగా వచ్చినఆయన "ఇక్కడ మీ కేంపని? పైనుంచి క్రిందికి రావద్దని చెప్పలేదూ మీకు? వెళ్ళండి. వెళ్ళండి మరి, తక్షణం" అని ఇంగ్లీషులో ఈయనను కోప్పడ్డాడు. నాకు మందిచ్చిన డాక్టరుగారు, అంతమనిషీ పిల్లి అయిపోయి, మెల్లగా జారిపోయినాడు. ఆ తరువాత ఆయన నావంక తిరిగి "ఏం కావాలండీ మీకు? ఎవరికోసం?" అన్నాడు. ఈక్రొత్త మనిషి ఎవరో నాకు తెలియదు. కాని మాడాక్టరును కోప్పడటంచేత ఆయన కంటె గొప్పవాడై యుంటాడని ఆలోచించి, వినయంగానే అన్నాను – "డాక్టరుగారికోసం అండీ" అని.

"ఏం కావాలె?" అన్నాడు.

"డాక్టరు జోసిఫ్‌గారి కోసం అండీ." అన్నాను.

"అవును నేనే; మరి ఏంకావాలో చెప్పండి" అన్నాడు ఆక్రొత్తమనిషి.

"మీరా అండీ" అన్నాను నేను ఆశ్చర్యంతో.

"అవును నేనే"

"చిత్రం. మరి ఆడాక్టరుగారు మీకు అసిస్టెంటు గాబోలు. ఆయనే మా ఇంటికొచ్చి బిడ్డను చూచి మందుకూడా ఇచ్చాడండీ" అన్నాను.

"మందుకూడా ఇచ్చాడూ?" అని ఆయన ఆశ్చర్యంతోనూ, ఆదుర్దాతోనూ అడిగాడు.

"ఇచ్చాడు" అన్నాను.

"ఆమందు బిడ్డకేమైనా ఇచ్చారా?" అని ఆయన మరీ ఆదుర్దాగా అడిగాడు.

ఆ ప్రశ్నకు జబాబుగా నేను "లేదు" అని అనటం విని స్వస్థత జెంది, "యింకా అదృష్టవంతులు, ఆమందు యిచ్చారు కారు" అన్నాడు.

"ఏమండీ?" అని అడిగాను నేను.

"ఆయన దక్షిణ ఆఫ్రికాలో కొన్నాళ్లుండి వచ్చాడు. ప్రస్తుతం ఆయనకు పిచ్చెత్తింది. నేను ఆయనకు మందిస్తూ అట్టి పెట్టుకున్నాను." అని నవ్వాడు. నవ్వి "మీ అమ్మాయికి ఏంజబ్బా?" అని ప్రశ్నించాడు.

"వంటినిండా ఎర్రని దద్దుర్లు పోసినైయండీ. భయంకరంగా ఉన్నాయండీ" అన్నాను నేను.

"ఊఁహు" అని డాక్టరు విని ఊరుకున్నాడు. "దురదా, మంటా కూడా ఉందని అంటుందండి" అన్నాను నేను, మళ్లీ. నామాటలు విని, "ఎప్పుడైనా ఇల్లాగ రావటంకద్దా ఆబిడ్డకూ?" అన్నాడు.

"ఎబ్బే, ఎప్పుడూ లేదండీ." అన్నాను నేను.

"అయితే, ఆ బిడ్డ తల్లితండ్రులకు కాని, మరి మీ కుటుంబంలో ఎవరికైనా కాని ఇల్లాంటి దద్దుర్లు తరచు రావటం కద్దా?"

"ఎబ్బే, మే మెవ్వరమూ ఎరగమండీ. ఇదేదో తమాషాగా

ఉందండీ" అన్నాను నేను.

డాక్టరు బాగా ఆలోచించి "ఎఱ్ఱనిదద్దుర్లా? సరే, నడవండి చూద్దాము" అని ముందుగా నడిచాడు.

పదిహేనునిమిషాల్లో ఇంటికి వచ్చాము. డాక్టరుగారిని మేడమీదికి తీసికెళ్లాం. పిల్ల పడుకొనే ఉంది. బూడిదరంగు కాయితం చెక్కు చెదరకుండా ఉంది.

"ఈ బిడ్డకేనండి" అన్నాను అమ్మాయిని చూపుతూ.

"ఇదంతా ఏమిటి? ఈకాయితం చుట్టారేమిటి?" అని అడిగారు డాక్టరుగారు.

"ఆయన ఇల్లాగ చుట్టమన్నారండి. చుడితే దద్దుర్లు పోతయ్యి అన్నాడు" అన్నాను నేను. డాక్టరుగారు పెద్దగా నవ్వాడు. నేనూ నవ్వాను.

"సరే, కాయితాలు తీసివెయ్యండి చూద్దాం" అన్నాడు డాక్టరుగారు.

దారాలన్నీ ఊడదీసి, కాయితాలన్నీ ఒక్కొక్కటే తీసి వేశాము. తరువాత డాక్టరుగారు పిల్లదేహమంతా పరీక్షించాడు గాని ఎక్కడా ఒక్కదద్దురైనా లేదు.

"ఏమండి, అంత ఆదుర్దా పడ్డారెందుకూ? పిల్లఒళ్లు బంగారంలా వున్నది ఏమీలేదే" అన్నాడు. నేనూ చూశాను. ఒక్కదద్దురైనా లేదు. మా ఆవిడా చూచింది. వళ్లు నిగనిగలాడుతుందేగాని ఒకదద్దురైనా లేదు. మాపిల్లలంతా చూశారు. దద్దురన్న మాటలేదు. మేమంతా తెల్లపోయి "పోయి

నాయండీ, దద్దుర్లన్నీ మాయమైనవి" అన్నాము - "ఎల్లాగ పోతయి, కాయితం చుడితే పోయేజబ్బు కాదే ఇది ?" అన్నాడు డాక్టరు. అని, నిజంగా చాలా ఆశ్చర్యపోయినాడు.

"ప్రొద్దున మీరు చూచినప్పుడు నిజంగా ఉన్నవా దద్దుర్లు ?"

"అమ్మో, ఉండకపోవటం ఏమిటండీ ! ఎర్రగా వంటినిండా ఉన్నాయి. నాకళ్ళతో నేను చూశాను. మాఆవిడ ఆమె కళ్లతో చూచింది. పిల్లలంతా చూశారు. ఇరుగూపొరుగూ కూడా చూశారు. కావాలంటే అందరిచేతా సాక్ష్యం ఇప్పిస్తాను. ఉన్నమాట నిజం. మరి ఇప్పుడు కనిపించటంలేదు. మీ పేరంటు తానే డాక్టరునని మాకు చెప్పి చాలా తమాషా చేశాడండీ. బూడిదరంగు కాయితం చుడితే గంటలో మాయమౌతాయన్నాడు. అక్షరాలా ఆలాగే జరిగింది."

"సరే, కానీండి ఎల్లాగయితేనేం, మీకు ఆదుర్దా తీరింది. సరే. యిక నేను వెళ్లుతాను" అని అంటూ ఆయన బయటికి దారితీశాడు. నేను కొంతదూరం ఆయనతో నడిచి "ఆ, ఎల్లాగు పోయినాయండీ ఆదద్దుర్లు, మందూమాకూ లేకుండానూ" అన్నాను.

ఆయన ఏదో నీళ్లు నమలి చప్పరించి ఊరుకొన్నాడు. నేను ఇంటికొచ్చి మొదటవచ్చిన ఆయన డాక్టరుకాదనీ, పిచ్చిఎక్కిన పెద్దమనిషి 'అనీ అసంగతులన్నీ చెప్పాను మా ఆవిడతో. కాంతం సంగతి అంతా విన్నది.

" అయితే ఇందాకా వచ్చి మన అమ్మాయిక్కి ఆదద్దుర్లన్నీ పోయే ఉపాయం చెప్పిన ఆయనా.... ??"

"ఆయన డాక్టరు కాదు, పిచ్చివాడు. ఇప్పుడొచ్చిన ఆయన డాక్టరు." అని విశదంగా చెప్పాను. అంత విడదీసి చెప్పినా మా ఆవిడకు అర్థం కాలేదుట.

" ఏమోనండీ ఇంటులో ఎవరు పిచ్చివాళ్లూ అన్న సంగతిలో మీరు చెప్పినమాటలు నేను నమ్మలేకుండా ఉన్నాను" అన్నది మా ఆవిడ పెంకెగా.

---



# ఉత్తమగ్రంథాలకు

నవలలు

నాటకములు

కథలు

చరిత్రలు

ప్రబంధములు

పౌరాణికములు

వైజ్ఞానికములు

వైద్యగ్రంథములు

## సరస్వతీ గ్రంథమండలి





పబ్లిషర్సు: అడ్డేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

